

గాజుల బత్తుడు

చిత్రకారుడు: ఎస్. శ్రీనివాసరావు—మద్రాసు

సంవత్సర చందా
రు. 12-0-0
విడిప్రతిక 4 అ.




సచిత్రవారపత్రిక

**Founder : K. NAGESWARA RAO**

సంపుటము 49
సంచిక 4
**28.9-55**

---

మన్మథ నిజ భాద్రపద శుద్ధ ద్వాదశి బుధవారం

---

బీజాపూర్ ఫిరంగి

ఫొటో: వి. కేశవశర్మ—మద్రాస్.

ముఖచిత్రం: ఎ. వి. ఎమ్. వారు ఇటీవల విడుదలచేసిన "వదిన"లో సావిత్రి.

## విషయానుక్రమణిక

# సీతమ్మతల్లి

రంధి సోమరాజు

సీతమ్మకు ఒక కొడుకూ, ఒక కూతురూ ఉన్నారు. కూతురుపేరు సుబ్బమ్మ. తల్లి ఆమెను ముద్దుగా 'సుబ్బులూ' అంటుంది. కొడుకుపేరు రామారావు. వాడు చదువుకుంటున్నాడు. హైస్కూలుకు రోజూ వెళ్తూ వస్తున్నాడు.

సీతమ్మకు కూతురువల్ల ప్రస్తుతం ఏ బాధా లేదు. ఆమె పెళ్లి ఎప్పుడో జరిగిపోయింది. పైపెచ్చు ఇప్పుడా కూతురే ఇంటికి పెద్ద కొడుకులా ఉపయోగపడుతూంది. ఇక ఆమెకొక కూతురుకూడా ఉంది. ఆ పిల్ల పేరు చిట్టి. చిట్టి మూడోతరగతి ముచ్చటగా చదువుకుంటోంది.

సీతమ్మ చాల గడసరి. తినడానికి ఏమీ లేకపోయినా, బడాయి కబుర్లు బహు చక్కని మిఠాయిఉండల్లాగచేసి, చుట్టుప్రక్కలవారికి రోజూ ఫలహారంగా పెడుతుంది. వట్టి మాటలకోసం చేరేవారికి ఆమె కబుర్లు తియ్యగాఉంటే ఉండొచ్చేమోగాని, తదితరులకు ఆమె అన్నా.. ఆమె మాటలన్నా ఎంతో ఏవగింపు. పూటకు తికాణా లేదుకాని, మాటలు చూస్తే కోటలు దాటతాయని ఆమెను అసహ్యించుకుంటారు.

నిజానికి సీతమ్మకు కుటుంబం గడవడమే చాల కష్టమైపోతోంది. పాపం ఆమె రోజూ ఈ విషయమై ఆలోచిస్తూనే వుంటుంది. తనకూ, తన కొడుక్కూ తిండి కావాలి. బట్టలు కావాలి. ఇంటద్దె కావాలి. చదువుకు జీతం కావాలి. పుస్తకాలకు డబ్బుండాలి. ఇవన్నీ ఎలా జరుగుతాయి? ఇవన్నీ ఎలా సాగుతాయి? ఆ చచ్చిపోయిన పెద్దమనిషి చిల్లిగవ్వ మిగల్చకుండా 'హరీ' అన్నాడు. అతను బ్రతికుండగా చేసిన ఘనకార్యమల్లా అమ్మాయిని ఇంత ఉన్నవాడికి ముడివెయ్యడంతో సరిపోయింది. దానితో అతని పని అయిపోయిందనుకున్నాడు. ఈ భార్య ఏమైపోవాలి... ఈ కుర్రకుంక ఏం కావాలి... అన్న బెంగేనా లేకుండా దల్లగా దాటుకపోయాడు. ఈభారమంతా తనెట్లా మోయగలదు? నోరుందంటేనే అయిపోతుందా? ఊళ్లో చిల్లిగవ్వ అప్పు పుట్టదు. అయితే ఏం...? సంసారాన్ని ఓ ఒడ్డుకు ఎట్లాగో అట్లాగ లాక్కొస్తూంది. ఇందుకనే ఏనుగంత తండ్రి ఉండేకన్నా... ఏకులబుట్టంత తల్లి ఉంటే చాలన్నారు. ఇదే ఆయనైతేనా... ఎప్పుడో సన్యాసుల్లో కలిసిపోయేవాడు. ఇప్పుడీ బాధంతా తనమెడకు చుట్టుకుంది; అనుకుంటూ ఒక్కొక్క అర్ధరాత్రి ఆమె నిట్టూర్చేది. అలాగని ఆమెనిబ్బరం ఎప్పుడూ సడలిపోలేదు.

సుబ్బులు కాపురంకూడ ఆ వూళ్లోనే. అందువల్ల, సీతమ్మబాధ సగం ఉపశమించింది. రోజూ ఆమెదగ్గఱకు పోయి అన్నం, కూరలూ తెచ్చుకొనేది. అవి తెచ్చేప్పుడు ఎవరేనా చూస్తారేమో అని, పెద్దపమిటచెఱగులో వాటిని కప్పి తెచ్చేది. అప్పటికీ 'ఏమిటండీ పిన్నిగారూ...అలా పట్టుకెళ్తున్నారు' అని ఎవరేనా అడిగారంటే... పాపం ఏం జేస్తుంది. ఏదో ఒకటి జవాబు చెప్పాలిగా ...... "ఏముందమ్మా ... మా అల్లుడిగారింటిదగ్గఱ ఒకటుంటే, ఒకటుండదు. అది రోజూ పోరుపెడ్తూనే ఉంటుంది ఇంట్లో టిఫినికేరేజి అవసరం ఉందని. కాని కొనడుగా...దుకాణం దగ్గఱకు మాత్రం భోజనం కేరేజిలోతప్ప పంపొద్దని ఆజ్ఞలేస్తూ వుంటాడు. అది మరి కారేజి ఎక్కడనుంచి తెస్తుంది? ఎవరుగాని ఇస్తారు? ఈ వూళ్లో తమ వస్తువులు మరొకళ్లకిచ్చేవాళ్లుగూడ ఉన్నారటమ్మా... మాయముండావూరు. ఎవరిదగ్గరేనా వుంటే, తేరగా వాడేసుకుందామనే వుంటుందిగాని, అవసరానికింత ఆదుకుందామని ఉండదుకదా...టిఫిను కేరేజి ఇచ్చినంత మాత్రాన వాళ్ల సొమ్మేం పోతుందో... అరిగిపోతుందా ... చిరిగిపోతుందా...నే నెప్పటికీ అంటూవుంటాను. ఎందుకే అడ్డమైనవాళ్లనూ అడుగుతావు... మన ఇంట్లో ఉందికదా....నన్నడిగి పట్టుకపోరాదూ...అని; దానికేముందో తెలుసా తల్లీ...'అదికాదే అమ్మా....అందరి మనసులూ ఒక్కలాగుండవు. ఒకందుకు పోస్తే, ఒకందుకు త్రాగాడని; నువ్వు ఒకందుకిస్తావు. తిరిగి నేను దాన్ని నీకిచ్చేసేప్పుడు, ఈ ఇరుగు పొరుగు అమ్మలక్కలు ఏమనుకుంటారో తెలుసా...చూడండి.... అమ్మగారికెలా దోచిపెట్టుందో అని ఆడిపోసుకుంటారు' అంది. చూడు అమ్మాయి... పుణ్యానికిపోతే పాప మెదురైందని; లోకం వరుస ఇలా వుంటుంది. కూతురును తల్లి చూడకూడదు. తల్లి కూతురును చూడకూడదు. తల్లి కూతురుకు ఏమిపెట్టినా పెట్టొచ్చుగాని, కూతురు సొమ్ము తల్లి ఇంతకూడ తినకూడదు. ఇంతకీ ఆ మారాజు మాకింత ఏదో ఇచ్చిపోయాడూ. ఆయనగారి ప్రావిడెంటు ఫండూ, ఇన్సూరెన్సుడబ్బూ...వాటిమీద రాలే వడ్డీ డబ్బులు...మాకు చాలవూ...మేం మాత్రం ఎంతమంది వున్నాము. మా కవే ఎక్కు తక్కు. ఇంతకూ నీకు తెలుసు కాబట్టి నువ్వు నమ్ముతావు. వాళ్ళకేమి తెలుసమ్మా ....నాలుక ఎటు తిరిగితే అటే మాటలంటారు' అంటూ అక్కడనుంచి కదిలిపోతుంది.

కదలిపోతూ...కదలిపోతూ..విచిత్రంగా నవ్వుతుంది. నవ్వి 'చూడే...అమ్మాయి... అవునుగాని, నువ్వు నీళ్లోసుకున్నావటగా ...నువ్వు చెప్పకపోతే అయిపోయిందనుకున్నావటే' ...ఇప్పటి పిల్లలకదేమిటో గాని, ఇంత లేసి సిగ్గులేమిటమ్మా...అంటూ ఇంటికి దారితీస్తుంది. ఆ అమ్మాయిని అలా పూర్తిగా ఉబ్బేసి, తనంటే ఎక్కడలేని ప్రేమ, ఆమె ఒలకబోసేట్టు మరిచేసుకొని తృప్తిపడుతుంది.

ఇక ఉన్నకాస్త డబ్బూ వడ్డీలకు తిప్పుతూ వుంటుంది. పేదవాళ్ల అవసరాలు ఆమెకు ఘోరమైన తప్పులుగా కనిపిస్తాయో ఏమో...కనీ వినీ ఎరుగని వడ్డీలు,ఆ తప్పులకు శిక్షలుగా విధించి, తన జీవితాన్ని చులాగ్గా ఓ ఒడ్డుకు ఈడ్చుకొచ్చేస్తూంది.

సీతమ్మకు కూతురుమీదకూడ అంత నమ్మకం లేదు. తను రోజూ ఆమెదగ్గఱకు పోయి, ఏదో ఒకటి తీసుకొని వస్తూండటం ఎంత కూతురైతే మాత్రం ఎన్నాళ్ళు సహిస్తుందని—ఆమెనుకూడ ఓకంట కనిపెడుతూనే వుంటుంది. అప్పుడప్పుడు, 'మీ నాన్న ఉంటే ఎందుకమ్మా నాకీ కష్టాలు.... ఆ వెధవని ఓ దారిలో పెట్టి, ఓ ఇంటివాణ్ణి చేసేవరకూ, ఎవ్వరేమన్నా నోరు నొక్కుకొని పడిఉండక తప్పేట్లు లేదు. లేకపోతే ఎప్పుడైనా చూశావటే ఆ ముదనష్టపు... ళ్ళందరితోనూ నేను మాటలుపడటం! నువ్వు ఇంతకూ మాకు ఏం పెడ్తున్నావనే...అందరూ అలా రాలిపోతున్నారు. పెద్దకూతురు పెద్దకొడుకుతో సమానంగదా... నువ్వు ఈమాత్రం సహాయం చెయ్యకూ

# ★ సీతమ్మ తల్లి ★

వుదూ...మన సూర్యనారాయణే బ్రతికి వుంటే...నన్ను అడుగుతీసి అడుగు వెయ్య నిచ్చేవాడటే...దేవుడు నన్నైనా తీసుకపోయాడు కాదు. పాపిష్టిదాన్ని ఇంత బ్రతుకూ బ్రతికి అడ్డమైనవాళ్లందరితోనూ నేనెందుకు చెప్పమాటలు పడటం? కుటుంబంలో ఒకరికి కష్టాలొస్తే ...ఒకరు ఆదుకోరూ...కష్టాలు మనకే వచ్చాయా...వాళ్లకు రావూ...నువ్వు ప్రతిదానికి అంత భయపడకూడదే అమ్మాయి... మన డబ్బు ఇష్టమొచ్చినట్లు చేసుకుంటాం.. ఆ బయట వాళ్లకెందుకు చెప్పూ దుగ్ధ! పోనీ వాడేమయినా పరాయివాడా...నీ తమ్ముడేగా...వాడికి చిట్టి నిలాగూ ఇచ్చి పెళ్ళిచేస్తావుగదా...ఎవరో ఏదో అనుకుంటారని, మరి నువ్వుకూడ అలా భయపడిపోతే ఎలా చెప్పు...' అనేది.

అప్పుడప్పుడు, 'మీ ఆయనకు మరీ అంత ఒదిగి ఉండకే తల్లీ...రేపో మాపో మళ్ళీ ఓ బిడ్డతల్లివి కాబోతున్నావు. నీకామాత్రం స్వతంత్రం లేదటే...నీకు ఏవి కావలిస్తే అవి కొని తెప్పించుకో...అలా మెత్తగా ఊరుకుంటే ఎలాగే...అయ్యో పిచ్చితల్లీ.. నా కడుపునెలా పుట్టావే...మరీ అంత మెతకా...అసలే అల్లుడికి పరాకూ అదీ హెచ్చు. జేబులోనే డబ్బులవీ ఉంచేస్తూ ఉంటాడు. ఏ దాసీపిల్లో చూసిందంటే చూడు...అవి కాస్తా కాజేస్తుంది. నువ్వు కొంచెం వేయికళ్ళతో కనిపెట్టుకొని చూస్తూ వుండాలి. నీకు ఇబ్బంది లేకపోతే, రాత్రి వాటిని నీ పెట్టెలో దాచి, ప్రొద్దున్నే అతను కొట్టువద్దకు వెళ్లేప్పుడు తీసి ఇస్తూంటే సరి. నీకు ఏమీ తెలియదే. అన్నీ చెప్పాలి...' అంటుంది. అలా అని, 'చూడు సుబ్బులూ..తమ్ముడి జీతం కట్టాలి. ఓ అయిదు రూపాయలుంటే ఇవ్వు' అని మెల్లగా పుచ్చుకొని ఇంటికి వేంచేస్తుంది.

## 2

ఇలా అగని కాలంతోపాటు సీతమ్మ కూడ ఆగకుండా సంసారాన్ని దొర్లించుకపోతూంది.

ఈలోగా రామారావు స్కూలుఫైనలు ప్యాసయ్యాడు. చిట్టి భర్తఘారంలోకి వచ్చింది. ఇక ఆమె అల్లుడు కొత్తగా ఒక లారీ కొని యజమాని అయ్యాడు. దీనితో సీతమ్మ కూతురు ఓ పిల్ల జమీందారిణి స్థాయిలోకి వచ్చింది.

ఇప్పటివరకు సీతమ్మ తన కొడుకు చదువు స్కూలుఫైనలుతో ఆపు చేసెయ్యాలనుకుంది. కాని ఇప్పుడా విషయం విరమించుకుంది. మెల్లగా కూతురుదగ్గర చేరింది. కాని వెంటనే, కూతురువల్ల ఈ పని కాదు అనుకొని, అల్లుడికే ఆ విషయమై కదిపింది. 'అబ్బాయి స్కూలుఫైనలు ప్యాసయ్యాడు' అంటూ.

అత్తగారితో ఎక్కువగా మాట్లాడే అలవాటు, పాప మా అల్లుడికి ఎప్పుడూ లేదు. కాని అతనికి అత్తగారి వాగ్ధోరణి బాగా తెలుసు. ఆమె ఎదురుగుండా ఆమె మాట తీసెయ్యడం బహు కష్టం. కాని మెల్లగా, 'మునిసిపాలిటీలోనో, డిస్ట్రిక్టుబోర్డులోనో ఎక్కడో ఓ దగుల ఉద్యోగం దొరికేట్టు చూస్తానండి' అన్నాడు; అత్తగారింతకన్నా ఎక్కువ కోరదనుకున్నాడు కాబోలు.

వెంటనే ఆ అత్తగారు అందుకుంది. 'అదేమిటి నాయనా! నువ్వుకూడ అలా అంటావు.'

పాప మా అల్లుడు ఆమెవైపు బిత్తర చూపులు చూస్తూ ఉండిపోయాడు.

ఇక ఆమె మొదలుపెట్టింది. 'కష్టానికైనా...సుఖానికైనా ... ఇక నువ్వేగదా నాయనా మాకు ...వాడిప్పుడింతవాడయ్యేడంటే నీ చలవవల్లే కదా..ఏమాట కామాటే చెప్పుకోవాలి. మాకు నువ్వు చేసిన సాయం ....ఇందఱున్నారు బంధువులు ఒక్కరు గాని చేశారా...ఎలాగైనా నీ సాటివాళ్ళెలా వస్తుంది? చిట్టిని తమ్ముడికిచ్చుకోవాలని అదేమో తెగ ఉబలాటపడుతూంది. నా మట్టుకు నాకు చిలకా గోరింకల్లాగ ఉంటారు...వీళ్ళిద్దరికీ ఆ మూడుముళ్ళూ ఎప్పుడు పడతాయా అని ఆ శ్రీమన్నారాయణమూర్తికి దణ్ణం పెట్టుకొని రోజూ లేవటమే...అయితే మన మనుకున్నంత మాత్రంలో అన్నీ అయిపోతాయా....కాలం కలిసిరావాలి. వాడేమో బి. ఏ. వరకూ చదువుతానని, తెగ మొరాయిస్తున్నాడు. పూట గడవడమే కష్టమైపోతూంటే ఎందుకు నాయనా ఈ చదువులు...అంటే వాడేమిటో బిక్కమొగ మేశాడు నాయనా ...అయినే ఉంటే నోరువిడిచి చదువుకుంటానంటున్న కుర్రాడ్ని అలా గాలికి విడిచిపెట్టేసేవాడా...అని కళ్ళనీళ్లు పెట్టుకున్నాను. ఆడముండని; నేనంతకన్నా ఏమి చేయగలను? నాదగ్గర ఇలా గుణుస్తూ కూర్చోకపోతే, పోయి మీ బావగార్నడగ రాదటరా...అంటే - అదేమిటో వాడికి సిగ్గట నాయనా...నీ దగ్గరే సిగ్గయితే, ఇక వాడు ఎందుకు పనికివస్తాడూ అని. ఏదో ఈ నాలుగేళ్లుపోతే, పిల్లకూడ కొంచెం ఎదుగుతుంది. అప్పటికి వాడు బి. ఏ., అది స్కూలుఫైనలూ, ప్యాసయితే వాళ్ళ దాంపత్యం ఇక చెప్పతరమా నాయనా... పూర్వకాలంలో ఏముంది? చదువూ లేదు. సంధ్యా లేదు. మా మాటా... మేమూ... ఎంతో మొరటుగా ఉంటాము. మాకు నాజూకు ఏం తెలుస్తుంది. నాకేమిటో ఈ చదువుకున్నవాళ్లనుచూస్తే ఎప్పుడూ ముచ్చటేస్తుంది. వాళ్ల శుభ్రత, వాళ్ల మాట నాణ్యత నాబోటిదానికి రమ్మంటే వస్తుందా...ఎంత నెమ్మదిగా ఉంటారు... ఎంత పొందికగా ఉంటారు...' అంది.

అల్లుడు సుబ్బారావు గొంతుకలో వచ్చి పెలకొయ్య పడింది. నాలుగు సంవత్సరాలు చదివించడానికి, ఒక కుటుంబాన్ని పోషించడానికి, తనుమాత్రం కోటీశ్వరుడా ఏం? పైన పటారం లోన లొటారం అని, లారీ కొన్నంతమాత్రాన, అయిపోయిందా.. దీనికి ఎన్ని అప్పులు చెయ్యలేదు. ఆ అప్పుల్ని తీర్చి క్షేమంగా, బయటపడినప్పుడు గదా...అనుకుంటూ మాటా మంతీ లేకుండా ఉండిపోయాడు.

అప్పుడే, 'ఏం నాయనా...వాడ్నిక్కడకు పంపేదా...' అంది అత్తగారు.

వెంటనే అతను జవాబు చెప్పలేకపోయాడు. కాని చిట్టినిచ్చి ఆ అబ్బాయికి పెళ్ళిచేస్తాముకదా అనుకున్నాడు. మెల్లగా 'సరేనండి' అన్నాడు ఇక చేసేదేమీ లేనట్లు; అక్కడే మంచంమీద పడుకొని నిద్రపోతూన్న బాబువైపు దృష్టి ప్రసరించి.

వచ్చిన పని సాధించిన సీతమ్మ, 'అలాగే నాయనా...నిన్ను నేను మరీ ఇబ్బంది పెడుతున్నాననుకోకు. పెళ్లివాడు మావాడికి నువ్వేమీ చదివించనక్కర్లేదు లే నాయనా...' అంటూ నవ్వి, 'వస్తానే సుబ్బులూ...' అని, 'చిట్టీ....ఇక మీ బావ దగ్గరే నువ్వు చదువుకోవే..బాగా అబ్బుతుంది' అని ఆ పిల్లవైపు పకపక నవ్వుతూ చూసి ఇంటికి దారితీసింది.

చిట్టి, 'పో...మామ్మా....' అంటూ, లోపలి గదిలోకిపోయి, దుప్పటి కొంగు పుచ్చుకొని, పట్టెమంచంమీద ఒకసారి దొర్లింది. తీరా ఆమె తనకు తాను తెలుసుకునే స్థితికి వచ్చేసరికి, ఆమె నిండా దుప్పటి చుట్టుకొని ఉంది.

అత్తగారు అలా వెళ్ళగానే సుబ్బారావు ఆమె చాకచక్యానికి ఆశ్చర్యపోయినా, 'పెళ్ళివాడు కట్నంగా ఏమీ ఇవ్వక్కర్లేదులే నాయనా' అన్న ఆమె మాటకు ఎంతో బాధపడిపోయాడు. ఇందమ్మంటే అందమ్మలా మాట్లాడిందేకాని, ఎక్కడా ఏకోశానా అపేక్ష ఉండి మాట్లాడినట్లు

లేదని లోలోన ఏమిటోలా అయిపోయాడు.

ఇక సీతమ్మపని ఇప్పుడు బాగానే ఉందని చెప్పాలి. ఆమె చక్కగా గేదనొకటి కొంది. దాని పాలు పూర్తిగా ఒక్క చుక్కైనా మిగలకుండా పిండి, వాటిలో తనకు తృప్తితీరినన్ని నీళ్ళు కలిపి, పాలపాడి చల్లి, శేరు పదణాలకు తక్కువ కాకుండా అమ్ముతూంది.

కొడుకు సినిమాలు అవీ చూడటానికి ఉబలాటపడితే, అతన్ని గట్టిగా మందలిస్తుంది. వాడు స్నేహితులతో తిరిగి ఇంటికి తిన్నగా వేళకు రాకపోతే గట్టిగా చూకలేస్తూంది. సాయంకాలం పిల్లలకు ప్రైవేటు చెప్పమని అతన్ని పీక్కుతింటూంది.

వాడి బుద్ధి ఎప్పుడూ చదువుమీదే లగ్నమయి ఉండేందుకు, అప్పుడప్పుడో పాఠం చెపుతూంది. 'మీ బావ పైకి అలా ఉంటాడుకాని, వర్తి కుళ్ళుబోతురా... నువ్వు బి. ఏ. వరకూ చదవడం అతనికి ససేమీ ఇష్టంలేదు. చిట్టినికూడ నీకు అతనికివ్వాలనిలేదు, ఏమనుకుంటున్నావో... అక్కను రోజూ రాత్రిళ్లు చంపుకుతింటూ వుంటాడు. మీ అమ్మగారికి నువ్వు మా సంసారాన్నంతా దోచి పెడుతున్నావు. నీకు సిగ్గులేదూ..అంటూ ఆపదానిలా దాన్ని సాధిస్తూ వుంటాడు. నువ్వు తిన్నగా చదివక పరీక్షల్లో డింకీలు కొట్టావంటే, ఈకాస్త సహాయంకూడా చెయ్యడు. పెద్దపులిలా నేనున్నాన్లే నాయనా ఈ సహాయం. మీఅక్కకసలు తలలో నాలుకే లేదు. అతనంటే హడలిపోతుంది. నువ్వు చదివి ఉద్యోగాలు చేస్తావనీ,వూళ్లు ఏలుతావని, నన్నింత సుఖపెడతావని నేనేదో ఆశపడుతూ వుంటే, మరి నువ్విలా తిరుగుతూ వుంటే ఎలారా మరి...మన తాహతెంత... మనమెంత ... మనరోజులు బాగులేవురా నాయనా...' అని హెచ్చరించేది.

పాపం రామారావు తల్లి పడుతూన్న కష్టాలను పూర్తిగా అవగాహన చేసుకున్నాడు. తల్లికిసుమంతకూడ కష్టం కలిగించగూడదని మనసులో నిర్ణయించుకున్నాడు.

తల్లిని ఎప్పుడు సుఖపెడతానా ... ఎప్పుడు సాటివారిలో తలెత్తుకొని తిరిగేట్టు చేస్తానా ... అని ఎప్పుడూ ఆలోచిస్తూ ఉండేవాడు. రాత్రిళ్లు అతని కప్పుడప్పుడు ఈ విషయాల మీదే కలలు వచ్చేవి. తను పెద్ద ఆఫీసరు అయినట్లు, తల్లిని పట్టుదిళ్ళ మధ్య కూర్చుండబెట్టి, బంగారుపళ్లెంలో పంచభక్ష్యపరమాన్నాలూ తను తీసుకపోయి ఆమెకు పెడుతున్నట్లు, ఏవేవో తియ్యని కలలు కనేవాడు.

ఇక తనతల్లి. అంటే, ఆ ఇరుగు పొరుగువాళ్ళకెందు కింతద్వేషమో అర్థంకాక తెగ నలిగిపోయేవాడు. తన తల్లికున్న తెలివి కాని, లౌకికజ్ఞానం కాని, సమయస్ఫూర్తి కాని ఆ వీధిలో ఒక్కరికి లేవని ఎప్పుడూ మురిసిపోయేవాడు. ఇంత చదువు చదువుతూన్న తనకుకూడ, తల్లి మాట్లాడుతూన్న మాటల్లోని అర్థం ఎంతో ఆలోచిస్తేకాని, అర్థంకావడంలేదు. నిజంగా అమ్మే... చదువుకొని ఉంటే ఈ దేశాన్ని పాలించేది కదూ...' అనుకొని ఏమిటో పిచ్చిగా లోలోన మురిసిపోయేవాడు.

## 3

సీతమ్మ ఆ నాలుగుసంవత్సరాలు నాలుగు రోజులుగా కాకపోయినా, ఏమంత కష్టం లేకుండానే దాటేసింది. తనుచేసిన ఘనకార్యానికి ఆమె మనసునిండా సంతోషించింది. ఇటు కొడుకు బి. ఏ. ఫస్టు క్లాసులో ప్యాసయ్యాడు. అటు చిట్టి స్కూలుఫైనలు ప్యాసయింది ఇక తన కష్టాలు కాటికి చాచుకున్నట్లే అనుకుంది. సుఖాన్ని సృష్టించుకున్నాను అనుకుంది. కాని ఏమిటో చిట్టి అనుకున్నంతగా ఎదగలేదు. దాని కళ్ళల్లో కాంతి తప్పించి శరీరం పుష్టిగాలేదు. ఆమె ఇంకా వ్యక్తురాలు కాలేదు. పీలగా ఉంటోంది. ఏమిటో ఎప్పుడూ ఆలోచిస్తూ కూర్చుంటుంది అనుకుంది.

ఇది ఇలా ఉండగా, అనుకోని సంఘటన ఒకటి జరిగింది. దీనితో పరిస్థితులన్నీ మారిపోయాయి ఒకరోజున ఆమె అల్లుడుగారి లారీ ఒక వంతెనమీదినుంచి క్రిందకు తిరగబడింది. లారీ ఇంజనుతో సహా ఎందుకూ పనికిరాకుండా పోయింది. థర్డ్‌పార్టీ ఇన్సూరెన్సు కట్టడంవల్ల రావలసిన పరిహారం రాకుండాపోయింది. దీనితో పచ్చగా కనిపించిన సంసారం ఒక్కసారి విషవాయువులు సోకిన చెట్టులా మాడిపోయింది.

ఈవార్త వినగానే సీతమ్మ గుండెలు కొట్టుకున్నాయి. కాళ్లు తడబడ్డాయి. ఆమె మనస్సు పరిపరివిధాల పోయింది. తానొకటి తలిస్తే దైవమొకటి తలచినట్లయింది. అల్లుడు దగ్గఱకుపోయి అతనికి ధైర్యం చెప్పింది.

'విచారించకుబాబూ ... పోయిందాన్ని మనం తిరిగి ఎలాగూ తీసుకరాలేం...నువ్వు సరిగ్గా తలచుకోవాలేగాని, ఇలాంటి లారీలు ఓ వెయ్యి మూడోనాటికి కొని పారెయ్యవూ' అంది.

ఆ అల్లుడు పాపం అమాయకంగా 'నా దగ్గఱ ఏముందండీ కొనడానికి...బోలెడన్ని అప్పులున్నాయి' అన్నాడు రుద్ధకంఠంతో.

'అలాగా నాయనా......' అంటూ ఆ అత్తగారు కూతురుదగ్గఱ కూర్చొని, 'అయ్యో తల్లీ నీ కెంత కష్టమొచ్చిందే...' అని కాస్సేపు కళ్లు ఒత్తుకొని, చిట్టిని పలకరించి, 'ఇక్కడికివ్వాళ మీ మావయ్య వచ్చేడటే...' అని ప్రశ్నించింది. చిట్టి, 'వచ్చేడు మామ్మా...ఇప్పటివరకూ ఇక్కడే ఉన్నాడు' అంది. 'సరే. వస్తానే...నువ్వు కూడ అలా మతిపోయినదానిలా తగలబడక, మీ అమ్మకు కొంచెం ధైర్యం చెప్పు. పోయినదానిగురించి అలా బెంగెట్టుకపోతారేం...' అంటూ చల్లగా ఇంటికి జారుకుంది.

ఆవేళ సీతమ్మ మనసు మనసులో లేదు. ఆమె తీవ్రంగా ఆలోచించింది. ఆ ఆలోచనల తీవ్రతలో మూర్ఛపర్యంతమూ అయింది. ఇటు కొడుకు...అటు కూతురు...ఆమెలో కదలసాగారు. ఆమె తను మళ్ళీ చీకటి కోనేటిలోనికి త్రోసివేయపడుతూన్నట్లు హడలిపోయింది. నేనేం పాపము చేశాను తండ్రీ...మాకీ శని అనుకుంది. 'ఈ కష్టాల్లోంచి మమ్మల్ని సుఖంగా బయటకు నెట్టివేయి బాబూ' అని భగవంతుని ప్రార్థించింది.

## 4

ఇది ఇలా ఉండగా, ఆ వూళ్లో పెళ్ళి

ఆంధ్రపత్రిక

సచిత్ర వారపత్రిక

# పిల్లల ప్రత్యేక సంచిక : ముఖ్యగమనిక

## దసరాకు బదులు దీపావళికి వెలువడుతుంది.

ఆంధ్రపత్రిక సచిత్ర వారపత్రిక పిల్లల ప్రత్యేక సంచిక ఏటేటా దసరాకు ప్రచురించబడుతున్నది, అదేవిధంగా ఈ సంవత్సరం కూడా ప్రకటించడం జరిగింది. కాని కారణాంతరాల వల్ల ఈ సంవత్సరం పిల్లల ప్రత్యేక సంచికను దీపావళికి ప్రచురించడం జరుగుతున్నదని పాఠకులు, ఏజెంట్లు గమనించ ప్రార్థన. దసరా పండుగకు మామూలు సంచిక ప్రచురించబడుతుంది. పిల్లలు పంపిన రచనలు, చిత్రాలు మొదలైనవి దీపావళికి ప్రచురించబడతాయి.

రచనలు పంపడానికి సెప్టెంబరు 20.వ తేదీ గడువుపెట్టి ఉన్నాము. పోటీకి పంపే పిల్లల రచనల్ని మాత్రం ఇకపైన స్వీకరించజాలము. ఇతరుల రచనలకు గడువు అక్టోబరు 20 వ తేదీ. దీపావళి వ్యాసాలు, చిత్రాలు, ఫొటోలకు కూడా అక్టోబరు 20 వ తేదీ వరకు వ్యవధి ఉన్నది.

—సంపాదకుడు.

## ★ సీతమ్మతల్లి ★

కొడుకులకోసం, వినికి వేసారిపోతూన్న ఆడపిల్లలుగల తలిదండ్రులకు ఫష్టుక్లాసులో బి. ఏ. ప్యాసయిన పేదవాడైన రామారావు ఆశాజ్యోతిగా కనిపించాడు.

'ఎవరయ్యా ఈ రామారావు' అన్నాడు వరసన్నతో వీరయ్య షావుకారు.

వరసన్న, 'మీకు తెలియదులెండి...... సీతమ్మ అని ఓ విధవరాలుంది. అతను ఆవిడ కొడుకు' అన్నాడు.

'ఎవరయ్యా ఆ సీతమ్మ' అన్నాడు తిరిగి వీరయ్య.

'ఈమధ్య లారీ తిరగబడలేదూ...ఆ సుబ్బారావు అత్తగారండీ...'

'ఓహో సుబ్బారావత్తగారా....సుబ్బారావు నాకు బాగా తెలుసు. అయితే అతనికో కూతురున్నట్లుందే......ఉన్నట్లుండటమేమిటి నా బొంద...స్కూలుఫైనలుకూడ ప్యాసయిందని చెప్పినట్లు గుర్తు.'

'అవును...అది నిజమే గాని, మరి ఇప్పుడతనిదగ్గిర చిల్లిగవ్వకూడ లేదు. ఎంత అప్పుగారి కూతురైతేనేం ఆ కుర్రాడు కట్నం, గిట్నం లేకుండా పెళ్ళాడుతాడటండీ....

'అదేమిటయ్యా అలా అంటావు. మేనగోడల్ని కూనేసి మనదాకా వస్తాడంటే నే నమ్మను.'

'మీకు పిచ్చిగాని......మేనగోడలేమిటండీ ఈ రోజుల్లో......డబ్బే మేనగోడలండీ...... బంధుత్వాలు గింధుత్వాలు జాంతానై. కట్నం సుమారుగా చేతిలో పడితేసరి..అందులో సీతమ్మ డబ్బాళ మనిషండీ...మనం కదిపి చూశామంటే పడకపోదు.'

'నాకు నమ్మకంలేదు; కూతురు నెత్తిమీద చెయ్యి పెడుతుందంటే...'

'అయితే కొడుకు నెత్తిమీద చెయ్యి పెడుతుందంటారా ... ఇప్పుడల్లుడిదగ్గర ఏమీ లేదు. చూసిచూసి కొడుకును గోతిలో దింపుతుందటండీ... మీకా బెంగ అనవసరం. ఫైసల్ చేసేవాడిని నేనున్నానుగా. ఆ విషయం నా కొదిలేయండి.'

'మరీ అంత హెచ్చుగా పెట్టేయక; ఉద్యోగం చూపిస్తానని, కట్నం పదివేలిస్తామని చెప్పు. అంతకు పైనైతే మనం భరించలేం.'

'సరే వస్తా.'

'ఇదిగో మాట, మరి మన అమ్మాయికి మన మిచ్చేదానికి, కొంచెం మించుమించుగా వాళ్లూ పెట్టాలి తెలుసా....'

'ఏమిటో...మనమ్మాయికా...అట్టే ఇలాగైతే లాభం ఉండదు. మళ్లీ ఇలాంటి తిరకాసు పెట్టకండి అసలుకే మోసం వస్తుంది. మీకు తెలియందేముంది; గద్దల్లా తన్నుకపోయేవాళ్ళు ఎంతిమంది మనకు పోటీగా ఉన్నారో....'

'సరే...ఏం చేస్తాం...'

వీరయ్యగారి దగ్గిర సెలవుతీసుకొని, వరసన్న కార్యసాధనార్థం అక్కడనుంచి ధీమాగా నడక సాగించాడు.

### 5

సీతమ్మ ఒక రాత్రి రాత్రంతా ఆలోచించింది. పదివేల రూపాయలు ఆమె కళ్లముందు మెరిశాయి. ఎమ్. ఏ. వరకూ చది



పూరి, చందన్‌తలాబ్‌లో నరేంద్ర దేవాలయం — ఫొటో: కమరుద్దీన్ ఖాన్—కటక్.

వించమని పట్టుబడితే సరి అనుకుంది. వ్యవహారం మెత్తబడేట్లుగానే ఉంది. అని దృఢపఱచుకుంది. తను ఇక కొద్ది సంవత్సరాలలో కలక్టరుగారి తల్లిగా మారిపోతున్నట్లు, ఇంకా ఏమేమిటో అయిపోతూన్నట్లు ఊహించింది. 'నా కొడుకు ఎంత అదృష్టవంతుడు!' అనుకుంది. అప్పుడే కూతురు గుర్తుకొచ్చింది. వెంటనే 'అమ్మ పిట్టా పిట్టగు. అనుక్కుతినా నివ్వని—వాళ్లు ఇవ్వాలేరు. ఇచ్చేవాళ్ళదగ్గఱ పుచ్చుకోనూ పుచ్చుకోనివ్వరేమిటి...' అనుకుంది. 'దీనిలోని సంగతి సందర్భాలన్నీ బాగా నచ్చజెపితే సరి. అల్లుడు మండిపడతాడేమో... మండితే మండుతాడు. మనకేం...ఎవరు మండితే వాళ్లే తగలబడతారు. ఎప్పుడు డబ్బిచ్చినా ఏడుస్తూనే ఇచ్చాడు కాని, ఒక్కసారిగాని నవ్వుతూ ఇచ్చాడా... చిట్టికేం...దాని పెళ్ళి నిక్షేపంలా అయిపోతుంది. మూర్కాలు పైనలు పొయ్యసయింది. దాన్ని ఎవడుబడితే వాడే ఎగరేసుకపోతాడు. అనుకుంది.

మరునాడు కూతురువగ్గఱకు వెళ్ళింది. తమ్ముడి పెళ్ళివ్యవహారం తల్లి అప్పుడే చాల దూరం తీసుకొచ్చిందని ఆనోటా ఆనోటా బడి తనదాకా వచ్చినమాటలనుబట్టి సుబ్బులు తెలుసుకుంది.

'అమ్మా నాకన్యాయం చేస్తావటే...' అని భోరున ఏడ్చింది. 'ఇన్నాళ్లు తమ్ముడు చేసుకుంటాడనికదే ఆశపెట్టావు. ఇప్పుడు వాడు చేసుకోకపోతే, మేనమామ ఎందుకు చేసుకోలేదని అపవాదు వెయ్యరటే...నా స్థితిచూసి నువ్వే ఇలాచేస్తే .... ఇక మేం ఎప్పటికైనా దాని పెళ్లి చెయ్యగలమటే...' అని విలపించింది.

సీతమ్మ మెల్లగా గుండెల్ని చిక్కబట్టుకుంది. 'అదేమిటే అలా అంటావు... పిచ్చిదానా...చిట్టికి నేను మూడు నిముషాలల్లో చేసెయ్యనటే ... దానికేమే రత్నాలబొమ్మ. దానిగుణం, దానిచదువు, ఈ వీధిలో ఎవరికున్నాయే... వాడేమిటో పిచ్చికుంక... మేనగోడలిని పెళ్లిచేసుకోవడమేమిటే...అమ్మాఁ ... రోజూ దానితో, నువ్వు నువ్వా అనిపించుకొని, ఒక్కచోట అన్నా చెల్లెళ్లలాగతిరిగి ఇప్పుడు దాన్ని పెళ్లాడితే ... ఏమిటో అదోలావుంటుందే ...అంటున్నాడు. నేనేమిచెయ్యనమ్మా ... ఇప్పటి కాలపువాళ్ల ఉద్దేశాలు ఇలా అధ్వాన్నంగా ఉంటాయని...వాడు వద్దు మొర్రో అంటూంటే ఇప్పుడు వాడిమెడకు వేసి దాన్ని కట్టడం వాడికీ మంచిదికాదు. ...చిట్టికీ మంచిది కాదు. వాడింకో ఏమన్నాడో తెలుసా ... 'ఇప్పుడు బావ ఎల్లాగూ కష్టాల్లో ఉన్నాడుకదా...వాళ్లు మనకు పదివేలెలాగూ ఇస్తారు. అందులో కొంత బావకిచ్చి వ్యాపారం చేయించుదామమ్మా....అటు బావాఁ బాగుపడతాడు. ఇటు మనకూ తృప్తిగా ఉంటుంది'

 సీతమ్మతల్లి 

అన్నాడు. చిత్రం ... నాకిలాంటి ఆలోచనే తట్టలేదు. వాడిబుద్ధి ఎంత గొప్పదనుకున్నావు. చిన్నవాడైనా చెప్పింది మన మంచికే, అయినప్పుడు వినాలమ్మా...' అంటూ ఇంకా ఏవేమిటో చెప్పబోతూన్న అత్తగార్ని - గదిలోంచి ఈ మాటలన్నీ వింటూన్న అల్లుడు గబగబా అక్కడనుంచి పరుగెత్తుకవచ్చి విపరీతమైన ఆవేశంతో 'వెళ్లు ముందు ఇక్కణ్ణుంచి...వెధవ ప్రేలాపనపేలక' అన్నాడు.

సీతమ్మకు ఇల్లాంటివ్యవహారం కోపంలోగాని తెగతెంపులు గాదని బాగా తెలుసు.

'ఎందుకునాయనా అంతకోపం...వాడు మాత్రం ఏమన్నాడని...' అంది.

అల్లుడు సుబ్బారావుకు కోపం ఇంకా ఆగలేదు. పైపెచ్చు అది రెట్టింపయింది. అతను ఒక్కసారిగా, 'వెళ్తావా...' అని అఱచాడు.

దానితో, సీతమ్మ, 'పోతాను నాయనా పోతాను. మంచిచెప్తే, చెడ్డ ఎప్పుడూ ఎదురౌతుంది. పడ్డవాళ్లెప్పుడూ, చెడ్డవాళ్లు కారులే...' అంటూ అక్కడనుంచి ఇంటికి దారితీసింది.

గదిలోఉండి, మామ్మ చెపుతూన్న ఈ మాటలన్నీ విన్న చిట్టి, ఆమె ధోరణికి నిలువెల్లా కంపించిపోయింది. 'నిజంగా మావయ్య అట్లా అన్నాడా...అబద్ధం...అబద్ధం...' అనుకుంది. తమ్ముణ్ణిపిలిచి 'మావయ్యను అమ్మ పిలుస్తూందని పిలుచుకరా' అని పంపింది.

సీతమ్మ గబగబా ఇంటికిచేరింది. చేరిన వెంటనే గట్టిగా ఏడుపుకు లంకించుకుంది. 'ఏమిటే అమ్మా ... ఏమిటే...' అంటూ రామారావు విస్తుపోయాడు.

'ఎందుకునాయనా నేను బ్రతికి... అడ్డమైన వాళ్లతోనూ మాటలు పడటానికేగా ఇంతబ్రతుకూ బ్రతికి ఒకడితో నేను మాటలు పడటమూ...నా కొడుకు నాకు లేడూ... నన్ను పోషించడానికి. వాడి సొమ్మేం తిని మేం బ్రతికామని' అంటూ రాగాలు తీయడం మొదలు పెట్టింది.

రామారావు తల తిరిగింది. 'ఏమిటమ్మా ఏమిటయింది' అంటూ తిరిగి ప్రశ్నించాడు అయోమయంగా.

'అదికాదు నాయనా...ఇలాంటివాడని తెలిస్తే, అక్కడకు నేను వెళ్ళకనే పోదును. అతన్ని బాగు చెయ్యాలని నేను అనుకోవడమేమిటి .... అతను నన్ను కొట్టడానికి రావడమేమిటి....' అంది.

రామారావు కుతకుత ఉడికిపోయాడు. ఎవడమ్మా ఆవెధవ ... నిన్ను కొట్టడానికి వాడికన్ని గుండెలున్నాయి'

'ఏమి చెప్పను నాయనా ... అంతా నా గ్రహచారం. చెప్పుకుంటె సిగ్గుచేటు.'

'అబ్బ! చెప్పమ్మా...ఎవడా వెధవ...'

'మీ బావరా నాయనా .. మీబావ.... దిగుతావా దిగవా గుమ్మం అంటూ చెయ్యెత్తాడు.'

'ఆఁ...ఏమిటే...' అంటూ రామారావు ఒక్కసారి తలక్రిందులైపోయాడు.

ఇంతలో బాబు వచ్చి, 'మావయ్యా... అమ్మ ఒకసారి నిన్ను రమ్మంటూంది' అంటూ పిలిచాడు.

వెంటనే సీతమ్మ, 'కావలిస్తే వాడి నడగరా...చిన్నవాళ్ళ నోటిలో దేవు డుంటాడు. ఏం బాబూ...మీ నాన్నను నేనేమన్నాననిరాఁ...చెయ్యెత్తాడు' అంది.

బాబు, తండ్రి చెయ్యెత్తడం గమనించనే లేదు. కాని అతను గట్టిగా అరవడంమాత్రం అతనికి తెలుసు. ఆ అరుపు చెయ్యెత్తినట్లే ఉంది. కాని ఎందుకలా అరిచాడో వాడికి సంగతి సందర్భాలు అర్థంకాలేదు. అమ్మమ్మ శాంతంగా ఏమిటో చెప్తూంటే, నాన్న ఎందుకలా విఱుచుకపడ్డాడో......ఆ పసివాడు ఊహించలేకపోయాడు. వాడు బిత్తర చూపులతో, మామ్మవైపు, మావయ్యవైపూ చూస్తూ ఉండిపోయాడు.

వెంటనే రామారావు, 'ఏరాఁ...మీ నాన్న చెయ్యెత్తాడా...' అన్నాడు.

బాబు కేమిటో ఈ పాడుగోల అర్థం కావడం లేదు. ఇంటిదగ్గఱ చూస్తే అలాగున్నారు. ఇక్కడ చూస్తే ఇలాగున్నారు. వాడు, తండ్రిపక్షాన నిలబడి మాట్లాడాలనుకున్నాడో, ఏమో మెల్లగా, 'మామ్మ... ఏదో అంది' అన్నాడు ఉడుకుబోతుతనంగా.

వెంటనే సీతమ్మ 'నే నేమన్నానురా.... నువ్వు నిజంగా చెప్పు...' అంటూ వాడివైపు తీక్షణంగా చూసింది.

వాడికిదంతా చాల చికాకుగా కనిపించిందో ఏమో......'ఏమో...నాకు తెలియదు...' అంటూ బిక్కమొగమేశాడు.

అప్పుడు రామారావు 'అసలు బావ ఎందుకమ్మా చేయెత్తాడు' అని తల్లిని ప్రశ్నించాడు.

వెంటనే సీతమ్మ, ఎందుకేమిటి నాయనా...కిట్టనివాళ్లెవరేమి చెప్పారో ఏమో...చిట్టిని నువ్వు పెళ్ళిచేసుకోనని అన్నావుట. మేనగోడలిని పెళ్లాడితే చెవులు పుచ్చుకొని వేళ్లాడుతుంది. రాచిరంపాన పెడుతుంది. అయినా ఇప్పుడు మాబావ ఏం ఇస్తాడేమిటి...తింటానికే వాళ్లకు గతిలేదు అన్నాడట' అంది.

బాబుకు అప్పుడు ఏదో జ్ఞాపక మొచ్చినట్లయింది. కాని అదికూడ పూర్తిగా కళ్లకు కట్టలేదు. మనసులో స్థిరపడలేదు. కాని, 'అదికాదు మావయ్యా...మామ్మ ఏమందో తెలుసా....నువ్వు కట్నం పుచ్చుకొని, మా నాన్న వ్యాపారం చెయ్యడాని కిస్తావని అంది' అన్నాడు.

వెంటనే సీతమ్మ, 'నిజం చెప్పావు నాయనా...నువ్వు చల్లగా వెయ్యేళ్ళు వర్ధిల్లాలి. మీ బావ ఎవడో వాజమ్మ మాటలు పుచ్చుకొని, అలాగ వాగుతూంటే మానసం చంపుకొని, ఊరుకోలేకపోయాను నాయనా ...అవును...నీకూ గతిలేక, వాడికీ గతిలేక ముష్టిపీనుగుల్లా బ్రతకాలనా...నీ ఉద్దేశం.. జోగీ జోగీ రాసుకుంటే బూడిద రాలిందని-బావను ఈ కష్టకాలంలో ఆదుకోవాలని అనుకున్నాడో ఏమో ... అంతమాత్రాని కింత కోపమెందుకు నాయనా...అన్నాను. అంతే...పోతావా పోవా...గుమ్మం దిగు.. ఒకటే మాట. ఇంతేకాని మనమాట వినిపించుకోడే...ఇంత కోపిష్ఠివాడి సంబంధం చేసుకొని ఏం బావుకుంటావురా నాయనా' అంది.

రామారావు పెదవి వణికింది. వెంటనే బాబుతో, 'పోరా...ఫో....ఇక్కడ మీ ఇంటికొచ్చేవాళ్లెవరూ లేరు. మీ బాబును లెక్క చెప్పమను...అణాపైసలతో ఇచ్చి పారేస్తానన్నాడని చెప్పు' అన్నాడు ఎంతో ఆవేశంతో.

బాబు చేసేదిలేక అక్కడనుంచి బిక్కమొగంతో ఇంటికి దారితీశాడు. వాడికి అక్కడ విన్న మాటల్లో ఒక్కటీ సరిగా గుర్తు ఉండటం లేదు. 'మావయ్య అన్న మాటలు జ్ఞాపకం ఉంటున్నాయి కాని, మామ్మ అన్న మాటలు ఏమిటో ఒక్కటీ తిన్నగా జ్ఞాపకం ఉండటంలేదు' అనుకున్నాడు.

మనమడు వెళ్లిపోగానే సీతమ్మ కొడుకుతో మెల్లగా, 'నువ్వంతమాట ఒక్కసారి అనగూడదు నాయనా ... పెద్దదాన్ని నేనంటే ఎలాగైనా సర్దుకోగలను.' అంది.

రామారావు ఈమాటలతో పూర్తిగా మారిపోయాడు. 'ఏడ్చాడులే. చదివించినంత మాత్రాన, మనమేమైనా అతనికి బానిసలమా...అతనిష్టమొచ్చినట్లు చలాయించడానికి' అన్నాడు.

'అదికాదు నాయనా...అవతల అక్క ఉంది కదూ ... దానికోసమైనా మనం కొంచెం నిగ్రహించాలి.' అంది ఆతల్లి!

రామారావు పసిహృదయం తల్లి మాటలోని ఆంతర్యాన్ని పసికట్టలేక పోయింది. 'ఛీ ... ఇలాంటివాడి సంబంధం చస్తే చేసుకోగూడదు. వాళ్ళెప్పుడూ మా సొమ్ము తినేశారు...మా సొమ్ము తినేశారు ...అనే ఏడ్పుగా ఉంటుంది. పెళ్లయిన తరువాత, చిట్టి ఇలాంటిమాటలతో దెప్పి పొడించిందంటే, నేను సహించలేను కూడాను' అన్నాడు.

సీతమ్మ ఒక్కసారి పూర్తిగా గాలిపీల్చుకుంది. 'ఇకక్షేమాలు' అనుకుంది. అంతా సక్రమంగా జరిగిపోయినందుకు తనను తనే అభినందించుకుంది. ఇటు తిరిగే చక్రాన్ని అటు త్రిప్పగలిగాను కదా...అని సంతోషించింది. ఆమె కళ్లల్లో విజయజ్యోతి మెరిసింది.

ఆమరునాడు ఆమె అనుకున్న కార్యం సులువుగానే జరిగిపోయింది. వీరయ్యగారి పిల్లనిచ్చి పదివేలకట్నంతో రామారావుకు వివాహం చేయడానికి నిశ్చయమైపోయింది.

## 6

సీతమ్మ, పెళ్ళి అయ్యేవరకూ, కొడుకును వేయి కళ్ళతో కాపాడుకోవాలని నిర్ణయించుకుంది. ఏ నాడు ఎవరు వచ్చి ఏమి చెప్పినా, రామారావు మనసు చిట్టివైపు మరలిపోవొచ్చు.

ఒకరోజున ఆమె భయపడినట్లుగానే జరిగింది. బాబు వచ్చి వాళ్లమావయ్యకని ఈ ఉత్తరం ఇచ్చి వెళ్ళిపోయాడు. 'ఏమిటి నాయనా అది' అంటే రామారావు చెప్పలేదు.

రామారావు ఆ ఉత్తరం పూర్తిగా చదివాడు. అది చిట్టి వ్రాసింది. అందులో నాలుగే నాలుగు ముక్కలున్నాయి. కాని అవి అతని హృదయాన్ని పట్టుకొని, తలక్రిందులు చేసిపారేశాయి. 'మావయ్యా... లెక్క చెప్తే నువ్వు డబ్బు ఇచ్చేస్తానన్నావట. నీ ఉదార స్వభావానికి చాల ఆనందమయింది. అన్న మాటప్రకారంగా నువ్వు తప్పకుండా ఆ డబ్బు తిరిగి ఇస్తావు కూడాను. కాని...అన్ని విషయాల్లోనూ నువ్వు అలా అంత ఉదారతను ప్రదర్శించగలవా...మావయ్యా......క్షమించు మావయ్యా ఇలా వ్రాసినందుకు' అని వ్రాసింది.

ఇది చదివిన తరువాత అతను ఒకవిధంగా మారిపోయాడు. ఏమిటేమిటో ఊహించాడు. కాని మాట ఇచ్చేసిన తరువాత ఇప్పుడెలా...తల్లిముందు ఏమిటో ప్రేలుడు బొమ్మలా తను మాట్లాడేశాడే కాని నిదానంగా ఆలోచించి మాట్లాడలేదు. ఎందుకు చదువు, కాల్చనా...అనుకున్నాడు.

సీతమ్మ, ఆ ఉత్తరం చూసినప్పటినుంచీ కొడుకు అదోలా ఉండడం గమనించింది. ఏమి మాట్లాడితే ఏమి వస్తుందో అని భయపడింది. 'ఏమైనా కొడుకు మాటఇచ్చాడు. ఆ మాట ఇంకెలాగూ తప్పలేదు. ఇంక తన చేతుల్లో ఏముంది. పెళ్ళికి ముహూర్తం కూడ పెట్టేశారు. ఇంకెలా తప్పించుకు పోతాడు అని మనసును కుదుటబరుచుకుంది.

కూతురును అల్లుణ్ని పెళ్లికి ఆహ్వానించింది. చిట్టిని రమ్మని బ్రతిమాలినట్లు మాట్లాడింది. కాని పెళ్లికి వాళ్లెవ్వరూ రాలేదు.

పెళ్లిపీటలమీద కూర్చున్నాడన్న మాటే గాని రామారావు మనసు మనసులోలేదు. తను చిట్టికి అన్యాయంచేసినట్లుగా పూర్తిగా నిర్ణయించుకున్నాడు. బావకు ఎంతో ద్రోహంచేసినట్లు తలచాడు. స్వయంగా తన స్వంతఅక్కకు కడుపులో చిచ్చుపెట్టినట్లు కుమిలిపోయాడు. ఆరోజున తనకంత బలహీనత ఎట్లా వచ్చిందో అని ఆశ్చర్యపోయాడు. తల్లిపన్నిన పన్నాగమంతా ఇప్పుడు కళ్లకుకట్టినట్లుగా కనబడుతూండడం గమనించాడు. 'అబ్బ! డబ్బు...తల్లినీ...కూతురునీ ఎలా విడదీసింది! అమ్మకు పేదరికమంటే ఎంతభయం! ఆ భయమే ఆమెనిట్లా అన్యాయాల్లోకి తరిమింది. అయ్యో నాకు జ్ఞానంలేదు. అమ్మగుణాన్ని కనిపెట్టలేకపోయాను. అక్కా...బావా...తమను ఆదుకోకపోతే తాము ఏమైపోయేవాళ్లు...ఏ అన్న కూడ చూడనివిధంగా అక్కకు సాయపడిందే...బావ తనకూ....తన చదువుకూ ఎంత డబ్బు ధారపోశాడు...ఈనాడు వాళ్లు చెడిపోయారని అమ్మ ఇట్లా చేస్తుందా ... అమ్మచేస్తే .... తను కూడ అట్లాగే చెయ్యాలా...అయ్యో! తను చిట్టిని తన హృదయంలోని మూర్తినికూడ ఎట్లా మరచిపోయాడు...ఏంఅన్యాయంచేసింది! నాకు ఏ శిక్ష విధించినా పాపంలేదు. నా కళ్లు మూసుకపోయాయి. నేను మనిషిని కాను. నేను మనిషినికాను' అని ఏమిటేమిటో అనుకుంటూ కృంగిపోతున్నాడు.

అప్పుడే బాబు అక్కడకు పరుగెత్తుకుంటూవచ్చి 'మావయ్యా...మావయ్యా...అక్క...నూతిలో పడిపోయింది మావయ్యా....' అంటూ వాడు ఒక్కసారిగా ఏడ్చాడు.

ఆ పెళ్లిలో బంధువులు, పురోహితుడు, పెళ్లికూతురు, ఆమె తండ్రి అందరూ ఒక్కసారి లేచిపోయారు. వెలుగుతూన్న విద్యుద్దీపాలు, గుమ్మాల వ్రేలాడుతూన్న మామిడి తోరణాలు, పచ్చగా మెరుస్తూన్న కొబ్బరాకులు అన్నీ 'అయ్యో పాపం' అంటూ దుఃఖించాయి. ఆమాట వినగానే అందరి మనసులూ కలతచెందాయి.

'ఆఁ ...ఏమిటీ...' అంటూ రామారావు, 'అయ్యో చిట్టీ...ఎంతపని చేశావు...ఎంత పని చేశావు....' అంటూ అక్కడనుంచి పరుగెత్తాడు.

అక్కడ ఉన్నవారంతా ఒక్కసారి 'ఆఁ...ఆఁ...' అన్నారు.

రామారావు, 'భగవంతుడా ..మా చిట్టిని బ్రతికించు...నా చిట్టిని బ్రతికించు భగవంతుడా' అనుకుంటూ అడ్డువచ్చిన వాళ్లను త్రోసుకొని, అక్కడ ఎవరిదో సైకిలు ఉంటే, అది ఎక్కి అతను ఎంతో వేగంతో చిట్టిని కలుసుకోడానికి వెళ్ళిపోయాడు.

అప్పుడే సీతమ్మ 'అయ్యో చిట్టీ...ఎంత అఘాయిత్యం చేశావే....నువ్విలా చేస్తావని నే నెప్పుడూ అనుకోలేదే...' అంటూ 'ఒరే నాయనా...పోయిన వాళ్ళతో మనమూ పోతామటరా...నువ్విప్పుడక్కడకు వెళ్ళకూడదురా నాయనా...వాణ్ణి ఆపండి..' అంది గగ్గోలుగా

ఈ మాటలు రామారావుకు వినబడలేదు. కాని అవి వినిపించినా అతనా తల్లిని తప్పక క్షమిస్తాడన్నది మాత్రం నిజం! ★



కంచి, కైలాసనాథదేవాలయ శిల్పం ఫొటో : ఎస్. వెంకటకృష్ణన్—మద్రాసు.

# యజమాని

## యస్వీ జోగారావు

ఒక హోటలు యజమాని కొత్తగా ఒక వంట పుట్టిని వేసుకుంటూ అతగాడితో ఇలా ఇంటర్వ్యూ చేశాడు:

'ఏం నువ్వు నమ్మకంగా పనిచెయ్య గలవుటయ్యా?'

'ఓ పదేళ్లు వకీలు వెంకయ్యగారింట మోతమోయించేశానండి. పదార్థాలు పడేసే దాతవుండాలిగాని వంట పాడవమన్నా పాడవదండి, నాచేతిమజా!'

'దానికేం, గొప్పవారింటి సొంతపని. సంతర్పణ వంటలెప్పుడేనా చేశావా?'

'దంచేశానండి. పంతులుగారింట్లో చాలా కథా కార్యాలూ జరిగేయి. వారు సంతర్పణలుకూడా సొంతంలాగే భేషుగ్గా చేయించేవారండి'

'ఓయబ్బో మా ఘటికుడిలాగున్నావు. ఆ భేషులూ గీషులూ మాకక్కరలేదుగాని సత్రంవంటలలో ఏమైనా అనుభవం ఏడిసిందా అది చెప్పు!'

'చిత్తం ఆయేసుపేదో యిహమీద యిక్కడే ఏడవాలి. సత్రం భోజనం ఎరుగుదునండి'

'సంతోషించాం!'

'చిత్తం. రకరకాల మిఠాయిల తయారులో ఆరిందాననిపించుకున్నానండి. ముందుగానే రుచిమానుకుని మరీ చేస్తానండి తరవాత మాటరాకుండా'

'అహా! అలాగా! అయితే దయచేసి తమరు ఫలహారాల సెక్షనుకి పోవద్దు. భోజనాలసెక్షను చూద్దురుగాని.'

'ఏదైనా ఫర్వాలేదండి. అదీ అలాగే, అంటే రకరకాలు అన్నీ మాంచి రుచిగా చేస్తానండి'

'నీ రుచులెవరికక్కావాలోయ్'

'మన హోటల్లో భోజనం చేసేవాళ్లందరికీను'

'వాళ్ల సంగతి నాకెందుకోయ్. వాళ్లుగాని రుచి మరిగితే పదార్థాలిట్టే అయిపోతూవుంటాయి. ఇదుగో చెప్తున్నా విను. ఆ రుచిపచులూ, రకరకాలూ, కరకరాలూ యీ చాకచక్యాలేమీ మాకక్కరలేదు. మాకు కావలసిందల్లా మేమిచ్చే పదార్థాల్లో ఏమీ దాచుకోకుండా, దాచవెయ్యడానికి తగినంత యిస్తామని కాదు, కూరో కూడో ఏదో యింత లకోటా, ఆ తొక్కా తోలూ చెట్నీ, తరుక్లూ మిరుక్లతో కలగూరగంప పులుసూ..."

'ఇహ అర్థమైందండి తమవుద్దేశం. అదెంత పనండి!'

'మాటలతో గాదు, విను మళ్లీ చెబుతున్నాను. ఒక కూరగాయ పాడవుతుందనుకో...'

'అసలు కొంత పాడైనవే కొంటాం గదండి, చవకగా వస్తాయని'

'అదిగాని వాడిపోతే కూట్, మాగిపోతే చెట్నీ, కుళ్లిపోతే కుళంబు...'

'మరి చెప్పనక్కరలేదండి. వివరాలన్నీ కళ్లకు గట్టినట్లు ఆనాయండి'

'గ్రహింపులంటే అలావుండాలి! సరేగాని పంతులుగారు, నీకు నెలకెంత యిచ్చేవారు?'

'ముప్ఫైఎనిమిదండి'

'ఆ యెనిమిది మాటకేంలే, నేనూ యిస్తాను ముప్ఫై, వకీలుగారిని వాకబుచేసి. నీ చాకచక్యం, తూనాబొడ్డు. నీ నమ్మకం చూసి. అసలు నీకు రెండుపూట్లా మరి భోజనం కూడా యిక్కడేగదూ.'

'వకీలుగారింట్లోనూ రెండుపూట్లా భోజనం చేసేవాడినండి. పంతులుగారి పాన్‌దాన్‌లోవి నాలుగు కవటాకులు సంగ్రహించుకుని రోజూ తాంబూలం కూడా అక్కడే వేసుకునేవాడినండి.'

'ఆ అంతవాడివి అవుదువు.'

'బాబ్బాబు ఆ యెనిమిదీ తీసేయకండి. పిల్లలవాడిని, కనికరించండి అనడానికి పిల్లలు లేరుగానండి, ఏదో నాబోటివాడి కుండవలసిన ఖర్చులు నాకూ వున్నాయి చాలా.'

'ఆ యెనిమిదీ బహుశా నీకు ఇంక్రిమెంట్లుగా వచ్చివుంటాయి. మరి నీ కిచ్చిన కటి సర్వీసు ఇక్కడ లెక్కరాదుగా. అదీగాక వకీలుగారింట్లో నువ్వు నాయకుడిలా వంట ఎంతో బాగా చేస్తేకదా యిచ్చేవారు డబ్బు. నువ్విక్కడ బాగా చెయ్యడానికని అంత శ్రమపడనక్కరలేదుగా. అయినా నీ ప్రయోజకత్వం చూసి నేనూ యిస్తానులే. కాని నాకు నచ్చకపోతే నా యిష్టం వచ్చినపుడు తీసేస్తాను తెలిసిందా? అసలు పంతులుగారు పదేళ్లబట్టి పనిచేస్తున్న నిన్నెందుకు తీసేశారు?'

'ఆయనకీమధ్య నామీద నేదో అనుమానం తగిలింది. అంటే దొంగననికాదుకుమండీ. అక్కడక్కడ సంసారి కొంపల్లో వంటవాళ్లను గురించిన నాడుక అనుమానం వుంది గదండీ. మొన్న నా విషయంలో, అంటే నేను పెద్ద నిబద్ధికుణ్ణని చెప్పడం గాదు గానండి, ఆయన పుత్తి అపోహపడ్డారు. ఇంతకీ యిక్కడ మన సొంతం ఎవరూ లేరు గదండీ అంచాత ఆ అభ్యంతరం వుండదనుకుంటాను'

'అయినా కొత్తవాళ్లు దగ్గిర పెట్టుకుని మసులుకోవాలి'

'చిత్తం'

'ఆ పప్పు రుబ్బుతోంది సుబ్బులు. దాన్నడుగు, నీ పనులేమిటో చెబుతుంది'

'చిత్తం' అని లోపలికి వెళ్ళాడు నారాయణ. సుబ్బులు కూచునే పనులు పురమాయిస్తోంది. 'నువ్వు లే. పప్పుకూడా నేనే రుబ్బేస్తా' నన్నాడు నారాయణ. ఇంతలో అప్పలకొండ నీళ్లకావిడ మోసుకొచ్చి గంగాళందగ్గర దించి బిందెలు తియ్యడానికి ఉక్కై లాసిలిస్తున్నాడు. అతగాడితో సుబ్బులు 'ఈనే మావా! మన కొత్త వంటపంతు'లని పరిచయంచేసింది. అప్పలకొండ నారాయణతో 'దండాలు పంతులుగోరూ' అన్నాడు. నారాయణ 'దండాలు నాకెందుకోయ్. అయ్యగారికి పెట్టవోయి' అన్నాడు. 'అబ్బో యీ అయ్యగోరికి దండాలు పనికిరావండి' అన్నాడు అప్పలకొండ. అవతల మరో నౌకరి కుర్రాడు పోలయ్య పొయ్యి రాజేస్తున్నాడు. నారాయణను ఎసరెక్కించమని హెచ్చరించింది సుబ్బులు. నారాయణ కచ్చ బిగించాడు.

నారాయణ అయ్యగారి ఆజ్ఞ తూచా తప్పకుండా పనిచేసుకుపోతున్నాడు. కాలేజీ కుర్రాళ్లు కతని వంటలేమీ సయించక హోటలు యజమానితో ఫిర్యాదులు చెయ్యడం మొదలెట్టారు. ఒకనాడాయన తానేమీ ఎరగనట్లు కాలేజీకుర్రాళ్ల ఎదుటే నారాయణని నానా చీవాట్లూ వేశాడు. నారాయణ జవాబు చెప్పకుండా గుటకలు

(౬౩-వ పేజీ చూడండి)

(సీరియల్)



జి.సి. రామకృష్ణ

## 7

దేవుని ఊరేగింపు ప్రారంభమయింది.

అందరూ దేవునికి నైవేద్యం యిస్తున్నారు. పిల్లలు కిలకిల నవ్వుతూ దేవుని పల్లకీ కింద దూరి పరుగెత్తుతున్నారు. వీరభద్రయ్యగారు నైవేద్యాలు అందుకుంటూ దేవునికి హారతి యిచ్చి, బియ్యము, పండ్లు, పల్లకీకి కట్టిన జోలెలో పోసుకుంటున్నాడు. దేవుని పల్లకీ యింటిముందు కొచ్చినప్పుడు గృహస్థులు కుటుంబ సమేతంగా వచ్చి ఈశ్వరుడికి నైవేద్యాలిచ్చి, భక్తితో నమస్కరించి వెళ్తున్నారు.

దేవుని పల్లకీ వెనకనే మాధవశాస్త్రి ఒంటరిగా నడిచిపోతున్నాడు.

ఊరేగింపు గ్రామంలో ఆఖరి వీధిలోకి వచ్చింది. ఒక చిన్న కుటీరంలోనుండి ఒక వృద్ధుడు నలుగురు పిల్లల్ని వెంటబెట్టుకొచ్చి దేవునికి నైవేద్యం యిచ్చాడు. ఆ వృద్ధుణ్ణి మాధవశాస్త్రి ఆశ్చర్యంగా చూచాడు. ఆయన కొత్తవాడిలాగా కనిపించగానే మాధవశాస్త్రి ఆయనదగ్గరకి వెళ్లి, "స్వామి తమరి దేవూరు?" అన్నాడు. ఆ మాటకు ఆ వృద్ధుడు అనురాగం తొణికేట్లు నవ్వి—

"అన్ని ఊళ్లూ నావే నాయనా. ఈ గ్రామంలో పాఠశాలకు ఉపాధ్యాయుణ్ణిగా వేశారు. నేను మొన్ననే ఈ గ్రామం వచ్చాను" అన్నాడు. ఆయన మాటలు వినగానే మాధవశాస్త్రికి ఆయనపై మితిలేని గౌరవం ఏర్పడింది. ఆ వృద్ధుడితో వచ్చిన పిల్లలు కళ్లు మూసుకొని భక్తితో 'జేజకు' దణ్ణం పెడుతున్నారు.

దేవుని పల్లకీ కదిలింది. మాధవశాస్త్రి ఆ ఉపాధ్యాయునివద్ద సెలవు తీసుకొని వెళ్ళాడు. సన్నాయి పాటకు డోలు సరిపోవడం లేదు. డోలు వాయించేవాడు ఏ లోకంలో ఉన్నాడో, కాటు విరబోసుకొని డోలు పగిలేటట్టు వాయించేస్తున్నాడు. సన్నాయి వాయించేవాడు తన యిష్టప్రకారం వాయిస్తున్నాడు. పన్నెండేళ్ల పసిబాలుడు తాళాలు చేతికి తీసుకొని వాయిస్తున్నాడు.

"తాళం సరిగా పడటం లేదురా యెదవా" అని డోలువాయించేవాడు, తాళాలు వేసే పసివాణ్ణి డోలు కఱ్ఱతో నెత్తిన మంచి దెబ్బ వేశాడు. ఆ బాలుడు తాళం వేయటం ఆపేసి, దేవుని పల్లకీకి ఎదురుగా నిల్చొని "అమ్మా" అని ఏడవడం ప్రారంభించాడు. "నోర్ముయ్" అని డోలు వాయించేవాడు మళ్లీ నాలుగు దెబ్బలు డోలు కఱ్ఱతో ఆ పసివాడి తలమీద వేశాడు. ఆ బాలుడు బావురుమని ఏడుస్తూ పరుగెత్తి మాధవశాస్త్రి వెనక నిల్చొని దీనంగా ఏడ్చాడు.

"ఛీ ఏంమనిషివిరా నువ్వు? పసివాణ్ణి అంతంత దెబ్బలుకొడ్తే, వాడు చావాలనా బతకాలనా?" మాధవశాస్త్రి కోపంతో అన్నాడు.

"స్వామీ, వాడు సచ్చినా బతికినా ఏమైనాసరే, వాడు నా శిష్యుడు, నేను వాణ్ణికొట్టేది కొట్టేదే."

మాధవశాస్త్రికి భరింపరానికోపం వచ్చింది. కానీ వాడితో మాట్లాడి ఏంలాభం అనుకొని మౌనంగా తలవంచుకొని ముందుకు నడిచాడు. వీరభద్రయ్య ముసిముసినవ్వులు నవ్వుకున్నాడు — దేవునిపల్లకీ మోసేవాళ్లు "హరంహరా" అని దిక్కులు మారుమ్రోగేట్లు అరుస్తూ కదిలారు. ఊరేగింపు వీధికొసకు వచ్చింది. అక్కడ మాదిగవెంకట్రాముడు వీధికడ్డం నిల్చొని, చేతులు పైకెత్తి స్వామికి దణ్ణం పెట్టి, మాధవయ్య దగ్గరకొచ్చాడు.

"స్వామీ, మా మాలవాడకు స్వామిని తీసకరావాల యియ్యాల. మేంగూడా మా కుండేదాంట్లోనే నైవేద్యాలిస్తాం, రాండి, తీసకరాండి" అన్నాడు.

వీరభద్రయ్య గడగడలాడిపోయాడు. మాధవశాస్త్రికి ఏమి చెయ్యడానికి తోచలేదు. కొంచెంసేపు ఆలోచించి—

"మాదేముంది వెంకట్రాముడూ నువ్వు రెడ్డిగారితో పోయి చెప్పు." అన్నాడు మాధవయ్య.

"ఏమని?" అని తూలుతూ అడిగాడు వెంకట్రాముడు.

"దేవుణ్ణి మాలవాడకు పంపించమని," అన్నాడు మాధవయ్య.

"ఓ, అడగనా! రెడ్డినిచూస్తే నాకేం బయమనుకున్నావా సామీ, అడగతాను. ఇప్పుడే అడిగొస్తాను" అన్నాడు వెంకట్రాముడు.

"సరే, పోయిరా పో" అన్నాడు మాధవయ్య.

వెంకట్రాముడు వెళ్ళగానే వీరభద్రయ్య దేవుని పల్లకీ మోసేవాళ్ళను తొందరపెట్టి పల్లకీ దేవాలయంలోకి మళ్ళించేశాడు. పూజారి పల్లకీకి కట్టిఉన్న జోలి విప్పి, గ్రామస్థులు నైవేద్యంగా యిచ్చిన బియ్యం, పండ్లు, టెంకాయ చిప్పలు, అన్నీ తీసి, సుబ్బి చేతికిచ్చాడు. సుబ్బి బరువు మొయ్యలేక మోస్తూ తీసుకొని వెళ్లింది.

వెంకట్రాముడు ధర్మకర్తగారి దగ్గరికి వెళ్లి ఉంటాడేమోనని మాధవశాస్త్రి రామిరెడ్డిగారి యింటికి వెళ్లాడు. కానీ అక్కడ వెంకట్రాముడు కనిపించలేదు. మాధవశాస్త్రిగారు నేరుగా లోపలికి వెళ్ళారు.

సావిత్రమ్మ చిరునవ్వు నవ్వి "మాధవయ్యా, అక్కణ్ణే... లోపలికి రావొద్దు ఈరోజు మాయింట్లో పాట్లేలు మాంసం కొంచెం రుచి చూచేట్లయితే రా." అన్నది—మాధవశాస్త్రి ఆమె పరిహాసాలకి ఏమీ తొణకుండా మెడమీదికి పోవడానికి మెట్లెక్కాడు.

సావిత్రమ్మ గబగబావచ్చి, "పోవద్దు, స్వామీ పోవద్దు" అంది.

"ఏవమ్మా, పోతేఏం?" అని భయంతో మాధవయ్య.

"ఎందుకు?" అంది సావిత్రమ్మ.

"రెడ్డిగారితో మాట్లాడాలి" అన్నాడు మాధవయ్య."

"ఏం? అంత మునిగిపోయిందేముంది? తర్వాత మాట్లాడొచ్చులే మాధవయ్యా." అని వినయంగా చెప్పింది సావిత్రమ్మ.

"రెడ్డిగారు నిద్రపోతున్నారా?" అన్నాడు మాధవశాస్త్రి.

సావిత్రమ్మ కోకిలస్వరంతో కిలకిలా నవ్వి, "ఇన్నిమాట లెందుకు మాధవయ్యా, ఆ మాట్లాడేదేదో నాతో మాట్లాడరాదా?" అంది.

"ఏమీ లేదమ్మా... ఊరేగింపుకు వచ్చే మంగలివాళ్లు బాగా తాగివస్తున్నారు. సన్నాయివాయించేవాడు ఏమి పాట వాయిస్తున్నాడో నాలుగుగంటలసేపు దేవునితో గూడా తిరిగినా నా కర్థంకాలేదు. ఇక డోలువాడు తప్పత్రాగి, వాడికి లోకమే తెలియడంలేదు. పన్నెండేళ్ల పసివాడు తాళంవేస్తున్నాడు. పాపం వాణ్ణి డోలు వాయించే రంగడు డోలుకఱ్ఱతో తల దిమ్మెక్కేటట్లు కొట్టేడు. ఎందుకురా పసివాణ్ణి అంతదెబ్బకొట్టేవు? అన్నాను. వాడు నా మాట లెఖ్ఖచెయ్యనేలేదు. మాదిగ వెంకట్రాముడు దోవలో అడ్డుపడి దేవుణ్ణి మాలవాడకు తీసుకురమ్మని మొండికేశాడు."

"తీసుకపోకూడదూ?" అంది సావిత్రమ్మ.

"రెడ్డిగార్ని చెప్పండే, ఎలా తీసుకపోను? రెడ్డిగార్ని అడిగిరారా, అలాగే దేవుణ్ణి, తీసుకొస్తాను, అన్నాను...ఇక్కడికి వెంకట్రాముడు రాలేదా?" అన్నాడు మాధవశాస్త్రి.

సావిత్రమ్మ పకపక నవ్వి, "అయ్యో, ఏం పిచ్చివాడివి మాధవయ్యా, వెంకట్రాముడు రెడ్డితో వచ్చి ధైర్యంగా మాలవాడకు దేవుణ్ణి పంపించమని అడుగుతాడా? సరే... మాధవయ్యా! అయితే ఇప్పుడు రెడ్డిగారితో ఏం మాట్లాడాలి?" అంది సావిత్రమ్మ.

"ఏమీ లేదమ్మా....మంగలివాళ్లు తాగి వస్తున్నారు, అని రెడ్డిగారితో చెపుదామని..." అన్నాడు మాధవశాస్త్రి.

సావిత్రమ్మ ఆవేదనతో నవ్వి నాలుగువైపులా చూచి, "మాధవయ్యా...మంగలి వాళ్లు తాగి వస్తున్నారని రెడ్డిగారితో చెప్పాలని వచ్చావు......కానీ రెడ్డిగారే తాగి మిద్దెమీద పడుకొనున్నాడు. ఇప్పుడు నువ్వు ఆయనతో మాట్లాడేవంటే,...... పండగపూట...మనసుకు....వృధాగా...లేనిపోని కష్టం..." అని సావిత్రమ్మ జాలిగా మాధవశాస్త్రిని అమాయకుణ్ణి చూచినట్లు చూచి, చిరునవ్వు నవ్వింది.

మాధవశాస్త్రి తల వంచుకొని ఆమెతో "వస్తానమ్మా" అని చెప్పి...నెమ్మదిగా యింటికెళ్లాడు.

విమలమ్మ భర్తకోసం ఎదురుచూస్తూ నిల్చొనిఉంది. మాధవశాస్త్రి ఇంటికి రాగానే ఆమె సంతోషంతో కాళ్లు కడుక్కోడానికి నీళ్ళిచ్చి అన్నం వడ్డించింది. మాధవశాస్త్రి భోంచేసి భగవద్గీత చదువుతూ హాయిగా నిద్రపోయాడు. భగవద్గీత హృదయంమీద పెట్టుకొని నిద్రపోతున్న భర్తనుచూచి విమలమ్మ ముసిముసినవ్వులు నవ్వుకొని మెల్లగా భగవద్గీతతీసి దూరంగా పెట్టింది.

మాధవశాస్త్రిగారు నిద్రమేల్కొనేసరికి సాయంత్రం నాలుగుగంటలయింది. కాఫీ త్రాగి మాధవశాస్త్రి రెడ్డిగారింటికి వెళ్దామని వీధిలోకి వచ్చాడు. యాచాదివాళ్లు వేషాలు వేసుకొని తప్పెట్లు తాళాలు వాయిస్తూ గంతులేస్తున్నారు. నిరుపేదలు ఇంటింటికీ తిరుగుతూ అన్నము, కూరలు, పిండివంటలు బ్రతిమాలి సంపాదించుకుంటున్నారు—

ఆరోజు ఉదయం ఊరేగింపుసమయంలో కనిపించిన కొత్త ఉపాధ్యాయుడు ఏదో పుస్తకం చేతులోపట్టుకొని, తల వంచుకొని వెళ్తున్నాడు. మాధవశాస్త్రి ఆ వృద్ధుణ్ణి చూడగానే ఆనందభరితుడై, "స్వామీ, ఎక్కడికి బయలుదేరారు?" అన్నాడు.

ఉపాధ్యాయుడు వినయంగానవ్వి, "ఇక్కడకే నాయనా. ఊరికే సాయంత్రం, అలా షికారుగా వెళ్లివద్దామని..." అన్నాడు.

"నేనుగూడా తమతో రావచ్చునా?" అని వినయంగా అన్నాడు మాధవశాస్త్రి.

"ఓ, తప్పకుండా దయచెయ్యండి. నేనూ, ఈ వూరికి కొత్తవాణ్ణి. నాకూ స్నేహితులు కావాలి. తప్పకుండా దయచెయ్యండి."

ఇద్దరూ మెల్లగా నడిచి చెరువుకట్టమీదికి చేరారు. ఆ చెరువు గ్రామానికి శ్రీరామరక్ష. ఆ చెరువు నీళ్ళతోనిండి, నీటిని దాచిపెట్టుకొని, అవసరమైనపుడు, గ్రామానికి ఇస్తూంటుంది. ఆ చెరు వెండిపోతే ప్రజల డొక్కలు ఎండిపోతాయి. ఆ చెరువు నీటితో సమృద్ధిగాఉంటే గ్రామీణుల ముఖాలు కూడా కళకళలాడుతూ ఉంటాయి.

మాధవశాస్త్రి, ఉపాధ్యాయుడు చెరువు కట్టమీద కూచున్నారు. శాస్త్రిగారు చిరునవ్వు నవ్వి, "తమ పేరేమిటో నేను అడగలేదు." అన్నాడు.

"నా పేరు సుబ్బారావు అంటారు నాయనా." అన్నాడు ఉపాధ్యాయుడు.

"తమరు ఎంతవరకు విద్యాభ్యాసం చేశారు?" అన్నాడు మాధవశాస్త్రి.

"స్కూలుఫైనలు చదివి, ట్రైనింగ్ చదివాను...చదువుకు అంతం ఏముంది లెండి.

## ★ దావాగ్ని ★

ఎంతకాలమైనా చదువుతూనే ఉండవచ్చు."

"ఆ పుస్తకం ఏమిటండీ" అన్నాడు మాధవశాస్త్రి. సుబ్బారావుగారు ఆ పుస్తకం మాధవశాస్త్రికి ఇస్తూ, "వివేకానందుని జీవిత చరిత్ర" అన్నాడు. శాస్త్రిగారు ఆ పుస్తకాన్ని భక్తితో తీసుకొని పై అట్ట తెరిచాడు. భారతీయ సంస్కృతిని దేశదేశాలా చాటిన వివేకానందుని చిత్రం చూచి మాధవశాస్త్రి అర్థంకాని ఆనందం అనుభవించాడు. లోకాన్ని సమ్మోహింపజేయగల స్ఫురద్రూపంతో వివేకానందుడు ఠీవి, ఆనందం మూర్తీభవించినట్లున్నాడు. మాధవశాస్త్రి కొంతసేపు వివేకానందుని రూపసంపదకు తన్మయుడై, "స్వామీ, తమ రీగ్రంథాన్ని పూర్తిగా చదివారా?" అన్నాడు.

"లేదండీ, ఇంకా ఇరవై పేజీలమాత్రం ఉంది"

"మీకూ, దైవచింత ఉన్నట్లుగానే ఉంది. నాకు కొన్ని సందేహాలున్నాయి స్వామీ, అవి మీ దగ్గర తీర్చుకోవాలనుకుంటున్నాను" అన్నాడు శాస్త్రి.

సుబ్బారావుగారు పకపకనవ్వి, ఒకరి సందేహాలింకొకరు తీర్చే రోజులు కావు నాయనా ఇవి. ఎవరిసందేహాలు వాళ్ళకుంటాయి. వాళ్ళసందేహాలు వాళ్లే తీర్చుకొంటే బాగుంటుంది—అంటే, నీవేమీ అపార్థం చేసుకోవద్దు. నిజానికి నా సందేహాలు నేనే తీర్చుకున్నాను."

మాధవశాస్త్రికి అంతులేని ఆశ్చర్యం కల్గింది. "మీరు బాగా చదువుకున్నవారు కాబట్టి మీ సందేహాలు మీరే తీర్చుకున్నారు. అందరికీ, ......సాధ్యమా స్వామీ...నా పుట్టుకునాకు గొప్పసందేహం ఉన్నది స్వామీ, అది ఇంకెవరైనా తీర్చాల్సిందే......" అని వినయంగా అన్నాడు మాధవశాస్త్రి.

"ఏమిటా సందేహం నాయనా"

మాధశాస్త్రిసందేహిస్తున్నట్లు చెరువువైపు చూచాడు—అప్పుడే సూర్యుడస్తమిస్తున్నాడు. చెరువులోనిజలం సూర్యబింబాన్ని ప్రతిబింబిస్తూ ఆనందంతో గంతులేస్తూ, కట్టను ఢీకొంటున్నది.

సుబ్బారావుగారు మాధవశాస్త్రి వైపు చూచి, "ఏమిటి నాయనా అంతగా ఆలోచిస్తున్నావు? అన్నట్లు, నీపేరేమిటో అడగలేదు..." అని ముసిముసి నవ్వులు నవ్వేడు.

మాధవశాస్త్రి పరధ్యానంతో చెరువులో హాయిగా ఈదులాడే బాతుల్ని చూస్తూ "నా పేరు మాధవశాస్త్రి అంటారండీ." అన్నాడు.

మాధవశాస్త్రి తన సందేహాన్ని చెప్పడానికి సంశయిస్తున్నాడని సుబ్బరావుగారు కనిపెట్టి, "ఏమిటో, మీ కేవో సందేహాలున్నాయన్నారు. కాని చెప్పడానికి సందేహిస్తున్నారు" అని పకాలున నవ్వేడు.

మాధవశాస్త్రి చిరునవ్వు నవ్వి—

"ఏమీ లేదండీ, దేవుడున్నాడా, లేడా, అనేదే నా సందేహం......ఆ సందేహం, నే నింతవరకూ ఎవ్వరికీ చెప్పలేదు. మిమ్మల్ని చూడగానే నా కెందువల్లనో చాలా సంతోషం కలిగింది. మీపైని గౌరవభావం ఏర్పడినందువల్లనే మీతో చెప్పగలిగాను"అని వినయంగా అన్నాడు.

ఆ ఉపాధ్యాయుడు, "అంతేనా?" అని విరగబడి నవ్వేడు. ఆ నవ్వు చూచి మాధవశాస్త్రి గాభరాపడ్డాడు.

"ఎందుకలా నవ్వుతున్నారు?"

"మీకు కోపం రాకుండా ఉంటే చెప్తాను—మీరు చూస్తే నిష్ఠాగరిష్ఠులుగా ఉన్నారు. కానీ మీ అంతటివారికి అటువంటి సందేహం ఎలా వచ్చిందా? అని నాకు చాలా ఆశ్చర్యంగా ఉన్నది" అని ఆ ఉపాధ్యాయుడు మళ్ళీ పకపక నవ్వేడు.

మాధవశాస్త్రి తలవంచుకొన్నాడు—

"నీ సందేహం తీరేదికాదు నాయనా. నేను కూడా ఆ సందేహంతోనే ఆలోచించి, ఎన్నాళ్ళకూ తీరక ఆలోచించడమే విరమించుకొన్నాను - కానీ నేను ఒక నిర్ణయానికిమాత్రం వచ్చాను. ఆ నిర్ణయం నీకు నచ్చకపోవచ్చు...అయినా నాఅభిప్రాయం చెపితే తప్పేమీ లేదనుకొంటాను - నా ఉద్దేశం, దేవుడు మనలోనే ఉన్నాడని - దేవు డెక్కడో స్వర్గధామంలో దేవతల మధ్య ఉంటాడని విశ్వసించడం తెలివితక్కువతనం" అని ఆ ఉపాధ్యాయుడు దృఢనిశ్చయంతో మాధవశాస్త్రి కళ్ళల్లోకి చూచాడు.

శాస్త్రిగారు నిశ్చేష్టుడై వింటున్నాడు. చెరువులో తళతళలాడుతున్న నీటినిచూస్తూ ఆ ఉపాధ్యాయుడు మాట్లాడుతూనే ఉన్నాడు. మాధవశాస్త్రి ఎదురు జవాబు చెప్పకుండా వింటూనే ఉన్నాడు. సుబ్బారావుగారు, మాధవశాస్త్రిని అనురాగంతో చూచి,—

"నాయనా, నువ్వు చాలా పసివాడివి. జీవితంలో నాకున్న అనుభవంలో, పదోవంతైనా నీకుండదని నిన్ను చూస్తేనే తెలుస్తూంది. నా జీవితం విచిత్రమైనది. తల్లిదండ్రులు చిన్నతనంలోనే గతించారు. ఎలా బ్రతికానో, ఎలా పెద్దవాణ్ణయానో, నాకే ఆశ్చర్యం. వారాలు తింటూ చదువుకున్నాను. మా తండ్రిగారుచేసిన అప్పుల కోసం, మావూరి భూస్వాములు నా ఆస్తిపాస్తులన్నీ కాజేశారు. నలుగురుపిల్లల్ని నాకు ఒప్పగించి నాభార్య వెళ్లిపోయింది. నన్ను ఆదరించే బంధువు లెవ్వరూ లేరు - నేనూ నీలాగే ఆలోచించాను; కొన్ని సంవత్సరాలు ఆలోచించాను. సర్వకాల సర్వావస్థల్లోనూ ఆ సర్వేశ్వరుణ్ణే ప్రార్థించాను - ఎన్నో అన్యాయాల్ని సహించాను. అధికార్ల చీవాట్లు పెడుతూంటే నన్ను కాదులే అనుకొని తలవంచుకొన్నాను... ఆఖరుకు ఒక్క నిర్ణయానికి వచ్చాను...ఏ మానవుడి హృదయంలో దయాదాక్షిణ్యాలు, ప్రేమానురాగాలు ఉంటాయో, వాడే దేవుడు—ఆ మానవుడే దేవుడు-" అని గద్గదస్వరంతో అన్నాడు సుబ్బారావు పంతులు.

మాధవశాస్త్రి ఆశ్చర్యంతో ఆనందంతో పరవశుడయిపోయాడు.

దేవుడు ప్రత్యక్షమై జ్ఞానోదయం కలిగిస్తే ఎంత సంతోషపడేవాడో, అంత ఆనందంతో మాధవశాస్త్రి ఆ ఉపాధ్యాయుణ్ణి దైవాన్ని చూచినట్లు చూచాడు.

"ఏ మానవుడి హృదయంలో దయాదాక్షిణ్యాలూ, ప్రేమానురాగాలూ ఉంటాయో, వాడే దేవుడు. ఆ మానవుడే దేవుడు" అనే వాక్యాలు మాధవశాస్త్రిగారి హృదయంలో ప్రతిధ్వనించాయి. సంధ్యా సౌందర్యాన్ని చూస్తూ యిద్దరూ మహా భక్తుల్లాగా కొంతసేపు కూచొని యింటికి వెళ్లాడు.

ఆనాడు మాధవశాస్త్రి అనుభవించిన ఆనందాన్ని కొలవడానికి ఏ సాధనాలూ

# ★ దావాగ్ని ★

చాలవు అంతరాత్మ స్వేచ్ఛగా హాయిగా తేలికపడినట్లు తోచింది శాస్త్రి గారికి. తను ఒక రెడ్డిగారి దగ్గర గుమాస్తా అనీ, అతనికి ఆగ్రహం కల్గితే తనపొట్ట గడవదనీ, మాధవ శాస్త్రిగారు మరిచేపోయారు. ఆరోజునుండి సంధ్యావార్చడం మానేశారు. భగవద్గీత తీసి దూరంగా పెట్టారు.

## 8

ఆరోజు సంక్రాంతిపండుగ. గ్రామీణులు ఆ పండుగను పెద్దపండుగ అని గౌరవంగా పిలుస్తారు.

ఆరోజు సూర్యోదయం కాకముందే కుంటివాళ్ళూ గుడ్డివాళ్ళేగాక, నిరుపేద లందరు బిచ్చమెత్తడానికి తయారవుతారు.

మాధవశాస్త్రిగారు సంధ్యావార్చడం మానేసినా విమలమ్మ బలవంతంచేసి పితృదేవతలకు తర్పణంవదలడానికి మాధవ శాస్త్రిని ఎలాగో ఒప్పించింది.

ఆరోజు వీధులన్నీ జన సమూహాలతో కిటకిటలాడుతున్నాయి. భాగవతం జట్టులు వేషాలు వేసుకొని మృదంగం, హార్మోనియం తాళాలు వాయిస్తూ, నృత్యం చేస్తున్నారు. విమలమ్మ ఉత్సాహంగా తిరుగుతూ, వచ్చిన బిచ్చగాళ్ళందరికీ బిచ్చం పెడ్తూ ఉంది. అన్నం అడిగినవాళ్లకు లేదనకుండా అన్నం వేస్తూ ఉంది.

ఎంత లోభులైనా పెద్ద పండుగనాడు బిచ్చం పెట్టకుండా ఉండరు. ప్రతియింటి ముందు గుంపులు గుంపులుగా బిచ్చగాళ్లు చేరి పరిహాసాలాడుకుంటూ, ఉత్సాహంగా నవ్వుతూ, కేరింతాలు కొడ్తూ ఉన్నారు.

ఆరోజు మాధవశాస్త్రిగారు సంతృప్తిగా భోజనంచేసి విశ్రాంతి తీసుకొని, హాయిగా నిద్రపోయి, మూడు గంటలకు నిద్ర లేచి కాఫీ తాగి, సుబ్బారావు పంతులుగారిని కలుసుకుందామని బయలుదేరాడు. రామిరెడ్డిగారి యింటిదగ్గర కొచ్చేసరికి, పెద్ద గోల ఏ మూలనుంచో విన్పించింది.

సావిత్రమ్మ గబగబా వచ్చి, "మాధవయ్యా! సమయానికొచ్చావు. కొంచెం అటు పోండి స్వామీ. రెడ్డిగారు కోడి పందేలు, పొట్టేళ్ళ పందేలు, పెట్టిస్తున్నారు. ఎందుకయ్యా, వద్దయ్యా అంటే నా మాటే విన్పించుకోకుండా వెళ్ళారు. పో, మాధవయ్యా, చెరువుకట్ట కింద పందేలు జరుగుతున్నాయట" అని సావిత్రమ్మ ఆందోళనతో బ్రతిమాలుతుంది. మాధవశాస్త్రి గుండె తీవ్రంగా కొట్టుకో సాగింది.

"నేను వద్దంటే నా మాట ఎవరు లెఖ్ఖ చేస్తారమ్మా!..." అని మాధవశాస్త్రి చిరునవ్వు నవ్వి, "సరే, అయినా పోతాను" అని చెరువుకట్టవైపు వెళ్లాడు.

మాదిగ వెంకట్రాముడు బాగా తాగి, పకపక నవ్వుతూ, నృత్యం చేస్తున్నాడు. హరిజనులు కొంతమంది గ్రామ మున్సబుగారైన వెంకటరెడ్డిగారి పక్క నిల్చొని ఉన్నారు; కొంతమంది రామిరెడ్డిగారి పక్క నిల్చొని ఉన్నారు.

పొట్టేళ్లు పరుగెత్తుకుంటూ వచ్చి ఢీ కొంటున్నాయి. బాగా తాగి వళ్లు తెలియక మత్తులో ఉన్న జనం 'హా' అని దిక్కులు పగిలేటట్లు గంతులేస్తూ అరుస్తున్నారు.

ఒకవైపు రామిరెడ్డిగారు ఠీవిగా నిల్చొని ఉన్నాడు...మాధవశాస్త్రిని చూచి కూడా రెడ్డిగారు తొణకలేదు, ఎఱ్ఱగా చింతనిప్పుల్లాగాఉన్న రామిరెడ్డిగారి కళ్లుచూచి, మంచి నిషాలో ఉన్నారని మాధవశాస్త్రి అర్థంచేసుకొన్నాడు. అవతలవైపు నిల్చున్న గ్రామమున్సబుగారైన వెంకటరెడ్డిగారు చక్కగా నిల్చోడానికి సాధ్యంకాక తూలిపోతున్నారు. మాధవశాస్త్రి ఒంటరిగా ఆ ప్రదేశంచుట్టూ తిరిగినా ఎవ్వరూ అతన్ని పలకరించలేదు. అందరూ ఎవరి లోకంలో వాళ్లున్నారు. కోడిపుంజులు పోట్లాడుకుంటూ రక్తం కారుతూంటే, రామిరెడ్డిగారు, వెంకటరెడ్డిగారు, మాత్రం, కొంచెం గాభరా పడుతున్నారు. మిగిలిన ప్రజలందరు కోలాహలంగా అరుస్తున్నారు. గ్రామమున్సబుగారైన వెంకటరెడ్డిగారి పక్షంలోఉన్న హరిజనులు ఆవేశపూరితులై మున్సబుగారి పొట్టేళ్లకు, కోడిపుంజులకు ఉత్సాహం కల్గించడానికి కేకలేస్తున్నారు. రామిరెడ్డిగారి పక్షంలోఉన్న హరిజనులు రెడ్డిగారి పుంజులు, పొట్టేళ్లు ఉత్సాహంతో పోట్లాడేట్లు ఎగిరి ఎగిరి గంతులేస్తూ అరుస్తున్నారు. వెంకటరెడ్డిగారు పందేనికి పదిపుంజుల్ని తెచ్చేడు. అన్నీ ఓడిపోయినాయి. నాలుగు పొట్టేళ్ళను పోటీకి పెట్టాడు. నాలుగూ రక్తం కారేదాకా పోరాడి, అలిసి కింద పడ్డాయి. వెంకటరెడ్డిగారు ఓడిపోయిన పొట్టేళ్ళను, పుంజుల్ని, పందేనికి వంద రూపాయలవంతున పధ్నాలుగువందలరూపాయలు రామిరెడ్డిగారికి యివ్వవలసి వచ్చింది.

వెంకటరెడ్డిగారు మత్తుగా తూలుతూనే పొట్టేళ్లు, పుంజులు, డబ్బు, రామిరెడ్డిగారికి సమర్పించి, అవమానంతో ఆక్రోశిస్తూ వెళ్ళాడు.

రామిరెడ్డిగారు ఠీవిగా పకపక నవ్వుతూ యింటికెళ్ళాడు. సావిత్రమ్మ ఎదురుగుండా రాగానే, రెడ్డిగారు తన విజయవార్తను ఆమెతో సగర్వంగా చెప్పేడు. రెడ్డిగారి పక్షంలోఉన్న హరిజనులు పొట్టేళ్ళను, పుంజులి, ఉత్సాహంగా గంతులేస్తూ ఇంటికి తీసుకొచ్చారు.

రామిరెడ్డిగారు పొట్టేళ్ళను, పుంజుల్ని కోయించి, వండించి, తన పక్షంలోఉన్న హరిజనులందరికీ, కడుపునిండా భోజనం పెట్టాడు.

పాపం వెంకటరెడ్డిగారు ఓడిపోయినా, ఒకపక్క అవమానాన్ని చంపుకొంటూ, ఇంక రెండుపొట్టేళ్ళు కోయించి, తన పక్షంలోఉన్న హరిజనులకు కడుపునిండా భోజనం పెటించాడు.

మాధవశాస్త్రి ఆ కోలాహలాన్ని చూచి ఆశ్చర్యపడి, చిరునవ్వు నవ్వుతూ నిల్చున్నాడు. సావిత్రమ్మ మట మటలాడుతూ విసుక్కుంటూ "ఏంచేస్తాం మాధవయ్యా, వాళ్ళకై వాళ్ళయినా తెల్సుకోవాలి, లేకపోతే ఒకరు చెప్పినమాటయినా వినాలి. రెండూ లేనోళ్ళను ఎవరుమాత్రం ఏంచేస్తారు.!" అని కోపంతో అంది.

రామిరెడ్డిగారు సిగరెట్టు పీలుస్తూ పకపకా నవ్వి,—

"నీ సొత్తేం పోయిందేపిచ్చిదానా!

ఏదో పెద్దపండుగనాడు సరదాగా ఉంటదని కొంచెం దల్నాచేశాం" అన్నాడు.

సావిత్రమ్మ విసురుగా తలముడి వేసుకొని, "నామాట మీరు ఏరోజువిన్నారు చెప్పండి? ...ఈరోజు వినడానికి!" రామిరెడ్డిగారు మత్తెక్కినకళ్ళతో ఒకసారి తీవ్రంగా చూచి,—

"నీమాట ఎప్పుడిన్లేదే నేను?— ఒక్క రోజు యిన్లేదని చెప్పు?" అన్నాడు.

"వింటున్నారులెండి......వద్దిగూ్య .. ఎందుకు ఆ అలబరిజనంతో కూడా కోడి పందేలకు పోవడం, అంటే ఏమన్నా విన్నారా? ఏమి గోల, ఏమికోలాహాలం ఛీ, ఛీ......నా కెందుకులెబ్బా" అంది సావిత్రమ్మ.

రామిరెడ్డిగారు మొరటుగా పకపక నవ్వుతూ భార్యను రీవిగా చూచాడు. సావిత్రమ్మ రివ్వున లోపలికి వెళ్ళింది.

పందెంలో ఓడిపోయిన గ్రామ మున్సబు వెంకటరెడ్డిగారు గ్రామంలోని భూస్వాములలోకల్లా పౌరుషం గలవాడు. ఆస్తిపాస్తుల్లో రామిరెడ్డిగారితో సమానమైనవాడే. అందువల్ల సంక్రాంతి పండుగనాడు జరిగిన అవమానాన్ని వెంకటరెడ్డిగారు మరిచిపోలేదు.

పండుగలు మూడు రోజులూ గ్రామం సందడిగా కోలాహలంగా కళకళలాడింది. పండుగలు వెళ్ళిపోయిన తర్వాత ప్రశాంతంగా కొన్ని రోజులు గడిచిపోయాయి.

పండుగ నెలలో దేవాలయానికి అయిన ఖర్చులు మాధవశాస్త్రిగారు రాశారు. ఎగ్జిక్యూటివ్ ఆఫీసరుగారైన కామేశ్వరరావుగారు శీవిగా చేవ్రాలు పెట్టారు. కామేశ్వరరావుగారు లెక్క చూసేవాడే కాదు. మాధవశాస్త్రిగారు ఎలా రాసినా సరే చేవ్రాలు పెట్టేసేవాడు. మాధవశాస్త్రిగారు రామిరెడ్డిగారు చెప్పినట్లు జాగ్రత్తగా అయిన ఖర్చుకన్నా యిరవై రెట్లు రాసేవాడు.

మాధవశాస్త్రిగారికి జీతం ముప్ఫయి రూపాయలే అయినా, కూరగాయలు, పాలు, పెరుగు, మజ్జిగ, రెడ్డిగారి ఇంటినుంచే లభించడంచేత, సంసారం ఏమంత కష్టం అనిపించేది కాదు. పిల్లా జల్లా ఎవ్వరూ లేకపోవడంవల్ల లక్షణంగా గడిచిపోతూనే ఉండేది—

ప్రతి సంవత్సరం శివరాత్రికి ఈశ్వరునికి తిరునాళ్లు జరుగుతుంది. వారం రోజులు గ్రామం సంరంభంతో సంతోషంతో కళకళలాడుతుంది. చుట్టుపక్కల గ్రామాల నుండి ప్రజలు తండోపతండాలుగా వస్తారు. గ్రామం ప్రజాసముద్రంలాగా, చూడడానికి ఎంతో శోభాయమానంగా ఉంటుంది. గ్రామంలో అందరి ఇళ్ళూ చుట్టాలతో నిండిపోతాయి. ఆడపిల్లలున్న తల్లిదండ్రులు తమ పిల్లల్ని అత్తవారిండ్లనుండి తిరునాళ్లు చూడడానికోసం పిల్చుకొచ్చుకుంటారు.

తిరునాళ్లు యింక అయిదారు రోజులుండనగానే గ్రామంలో ప్రజలు ఎక్కువయ్యారు. పట్నవాసాలనుండి అన్ని రకాలైన సామాన్లతో వచ్చి వ్యాపారస్థులు అంగళ్లు పెట్టడం ప్రారంభించారు.

మాధవశాస్త్రిగారికి ఊపిరి పీల్చడానికి కూడా తీరిక ఉండడంలేదు. ప్రతిరోజూ నెల్లూరికిపోయి తిరునాళ్లకు దేవాలయంలో అవసరమైన సామాన్లు తీసుకొస్తున్నాడు.

ఒకరోజు మాధవశాస్త్రిగారు నెల్లూరికి వెళ్ళి అక్కడ రెడ్డిగారి బసలో సామాన్లన్నీ పెట్టి, అలిసిపోయి కుర్చీలో కూచున్నాడు. ధర్మకర్తగారైన రామిరెడ్డిగారు కలెక్టరుగారితో ఏదో పనుందని వెళ్లారు.

మాధవశాస్త్రి పడకకుర్చీలో కూర్చొని ఎగురుగాఉన్న మోటారుకారును చూస్తూ కూచున్నాడు. డ్రైవరు కారు తుడుస్తున్నాడు. ఇంతలోగా ఒకవైపునుండి మధురమైన సంగీతం విన్పించింది

మాధవశాస్త్రిగారు పడక కుర్చీలోనుండి లేచి మేడమీద వరండాలో నిల్చున్నారు. వందమంది ప్రజలు గానంచేస్తున్నట్లు స్పష్టంగా విన్పించింది, ఘణఘణ మ్రవంగం చప్పుడు హృదయాన్ని పులకింపజేసింది. వీణ, హార్మోనియం, ఫిడేలు, మృదంగం, అన్నీ జతకలిసి హాయిగా విన్పిస్తున్నాయి. చాలామంది తాళాలు వాయిస్తూ గానంచేస్తున్నట్లు మాధవశాస్త్రి గమనించి మేడదిగి, ఆవీధిలోనడిచి తూర్పువైపు వెళ్ళాడు.

ఒక పెద్దభవనంలోనుండి ఆ దివ్యసంగీతం విన్పిస్తూఉంది మాధవశాస్త్రి హృదయాన్ని ఆ సంగీతతరంగాలు చుట్టుముట్టి అతనిని బానిసగా చేసుకొన్నాయి. శాస్త్రిగారు నిర్భయంగా నడిచి ఆ భవనంలోకి ప్రవేశించాడు. శాస్త్రిగారిని చూడగానే ఒక పెద్దముత్తైదువ ఎదురొచ్చింది.

"రానాయనా, లోపలికిదయచెయ్యండి" అని ఆదరంతో పిల్చింది. ఆమాటలు మాధవశాస్త్రి హృదయాన్ని ఆనందసాగరంలో ముంచివేశాయి. - 'ఎవరి హృదయంలో ప్రేమానురాగాలు, దయాదాక్షిణ్యాలూ ఉంటాయో, అతడే దేవుడు' అని సుబ్బారావుపంతులుగారు చెప్పిన వాక్యాలు మాధవశాస్త్రిగారికి తటాలున జ్ఞాపకానికొచ్చాయి

మాధవశాస్త్రి తన్మయుడై లోపలికి ప్రవేశించాడు. ఇంటినిండా స్త్రీలు, పురుషులు, పసిపిల్లలు అందరూ కూర్చొని పాడుతున్నారు. వారిఎదుట ఒక పెద్దపటం ఉంది. ఆ పటంలోఉన్న మహానుభావుడెవరో మాధవశాస్త్రికి తెలియలేదు. కాని ఒకపక్క కూచొని అందర్నీ చూశాడు. అందరూ అర్ధనిమీలిత నేత్రులై భజన చేస్తున్నారు. వీణ వాయించేవ్యక్తి తన్మయుడై చేతులు యంత్రాలవలె కదిలిస్తూ వాయిస్తున్నాడు. ఒక పన్నెండేళ్ళ అమ్మాయి గోపికవేషం వేసుకొనివచ్చి -

"కుసుమహారా, కుసుమహారా,
కుదురుగ కూర్చుండరా,
నా కన్నులపండువుగా,
నీ మూర్తిగాంచి సంతసింతురా.

కుసుమహారా..."అని పాడుతూ నృత్యం చేయడం ప్రారంభించింది. అందరూ పల్లవి పాడుతున్నారు. మధురమైనసంగీతం, ఆ సంగీతానికి తగిన వాయిద్యాలు, ఆ వాయిద్యాలకు తగినట్లు గజ్జెలుకట్టుకొని ఘల్లుఘల్లున నృత్యంచేస్తున్న ఒక బాలిక—ఆ దృశ్యంచూచి మాధవశాస్త్రి హృదయం జల్లున పులకరించింది. అది స్వర్గమా, భూలోకమా అనే సందేహం కలిగింది. తన్మయుడై అందరితో కలిసి, "జై, హరనాథ జై, కుసుమకుమారిజై," అని పాడుతూ మాధవశాస్త్రిభజనచేస్తూ కూచున్నాడు.

భజన పూర్తిఅయిన తర్వాత ఒక స్ఫురద్రూపి అయిన భక్తుడు నిల్చొని, హరనాథుని ప్రేమతత్వాన్నిగురించి ఉపన్యాసం ప్రారంభించాడు. "ఎవరండీ ఆయన?" అని మాధవశాస్త్రి పక్కనున్న భక్తుణ్ణిఅడిగాడు. "ఆయన ం ళ్ళబండి వీరభద్ర రావుగారు.

## ★ దావాగ్ని ★

విద్యాశాఖాధికారి" అని ఆ భక్తుడు జవాబు చెప్పాడు.

"మానవుడు భగవంతుని కోరికలతో ప్రార్థించకూడదు. మనం భగవంతుని ప్రేమించాలి. ప్రతిపనీ చేసేటప్పుడు ఆ ప్రభువే మనచేత చేయిస్తున్నాడు, అనుకోవాలి. మనల్ని కాపాడేభారం. ఆ ప్రభువుకేవదిలేయాలి. అంతేకాని, ఏవో కోరికలు మనసులో ఉంచుకొని, ఆ కోర్కెలు తీరెందుకోసం భగవంతుణ్ణి ప్రార్థించటం భక్తుని లక్షణంకాకూడదు. 'మీ భారం మోయడానికే నేను ఈ లోకంలోకి వచ్చాను.' అనేవాడు హరనాథ ప్రభు." అని తన్మయుడై రాళ్ళబండి వీరభద్రరావుగారు ఉపన్యసించారు. ఉపన్యాసం పూర్తి అయిన తర్వాత అందరికీ ప్రసాదం పంచిపెట్టి టీ యిచ్చారు. మాధవశాస్త్రి ప్రసాదం తీసుకొని భక్తితో ఆరగించి కూచున్నాడు.

భక్తులందరు ఒక్కొక్కరే కుసుమహరనాథుని పటంముందు నిల్చొని—"ప్రభూ ...ప్రభూ..." అని దీనంగా ప్రార్థించి కన్నీళ్లు తుడుచుకుంటున్నారు. మాధవశాస్త్రిగారు కూడా పటంముందు వెళ్ళి నిల్చొని భక్తితో కళ్ళు మూసుకొని నమస్కరించాడు. స్త్రీలు, పురుషులు ఒక్కొక్కరే ప్రశాంతంగా వెళ్లడం ప్రారంభించారు.

మాధవశాస్త్రిగారు ఆ భవనంనుండి వెలుపలికొచ్చారు. అంతా చీకటి. వీధి దీపాలు మాత్రం మినుకు మినుకుమని వెలుగుతున్నాయి. మాధవశాస్త్రి గాభరాపడి గబగబా బసకు పరుగెత్తాడు. రామిరెడ్డిగారు కార్లో కూచొని సామానన్నీ కారులో పెట్టుకొని, ప్రయాణమవుతున్నాడు.

రెడ్డిగారు శాస్త్రిగార్ని చూడగానే మండిపడి, "ఏంది స్వామీ, ఈ బేరం? ఏడకి పోయినావు? సాయంత్రం నాలుగు గంటల్నించీ నీకోసం ఎతుకతానే ఉండాను ఏడకు బోయ్యావు స్వామీ?" అని గద్దించాడు.

"ఇక్కడికేనండి, మా బంధువులు ఈపక్క వీధిలో ఉన్నారు. వాళ్ళింటికి ఎప్పుడూ వెళ్లేవాణ్ణి కాను. ఈరోజు వాడు కనపడి ఎంత కాదన్నా భోంచేసిందాకా వదల్లేదు" అని మాధవశాస్త్రి చిన్న అబద్ధం చెప్పి యజమానిని శాంతపరిచాడు.

"సరేగానీ, మీ యజమానురాలికి చదువుకోడానికి ఏవైనా పుస్తకాలు కొనుక్కొని రాపో" అని రామిరెడ్డిగారు ఇరవై రూపాయలు తీసిచ్చాడు.

మాధవశాస్త్రి ట్రంక్ రోడ్డుకు వెళ్ళి కొన్ని కథల పుస్తకాలూ, కొన్ని పద్య కావ్యాలు కొనితెస్తూ, త్రోవలో కుసుమ హరనాథుని పటం ఒకటి కొనితెచ్చుకున్నాడు.

రామిరెడ్డిగారు ఆ పటంచూచి, "ఏం పటం అది?" అన్నాడు.

"ఇదీ...హరనాథుని పటమండీ, ఈయన భగవంతుని అవతారంట" అన్నాడు మాధవశాస్త్రి.

రామిరెడ్డిగారు పకపక నవ్వి, పటం చేతికి తీసుకొని కళ్ళకద్దుకొని—

"కొత్త కొత్త దేవుళ్లొస్తున్నారయ్యా మనకు. సాయిబాబా మందిరానికి బోయినా, ను వ్వెప్పుడన్నా? డాక్టరుగారింట్లో - బలే బాగా ఉంటది పటం." అన్నాడు రామిరెడ్డి.

మాధవశాస్త్రిగారు సాయిబాబా పేరు విన్నాడుగానీ ఎప్పుడూ సాయిబాబా మందిరానికి వెళ్ళలేదు. దైవికంగా అనుకోకుండానే హరనాథబాబా భజనకు హాజరవడం, తన్మయుడై అందరితో కలిసి భజన చేయడంవల్ల, మాధవశాస్త్రికి కుసుమ హరనాథునిపై భక్తి కుదిరింది. దేవుడున్నాడా లేడా అనేసందేహం అడుగున పడిపోయింది. - కారు శరవేగంతో పోతూఉంటే, మాధవశాస్త్రి కుసుమహరనాథనామస్మరణచేస్తూ కూచున్నాడు.

ఊరుచేరి కుసుమహరనాథునిపటం విమలమ్మకిచ్చి, "ఈ మహానుభావుడు దేవుడు. పాపాత్ముల్ని ఉద్ధరించడానికోసం ఈ లోకంలో పుట్టాడు." అని చెప్పి నెల్లూర్లో తను భజనకు హాజరవడం ఆసంగీతానికి తాను ఎలా ముగ్ధుడయిపోయిందీ మాధవశాస్త్రి వివరంగా భార్యకు చెప్పాడు. అసలే విమలమ్మకు దైవభక్తి ఎక్కువ. భర్త చెప్పిన మాటలు అక్షరాలానమ్మి హరనాథుని పటాన్ని సీతారామస్వామిపటం పక్కనే పెట్టి పూజ చేయడం ప్రారంభించింది.

[ఇంకావుంది]

# సామంతం

ఊరిసలు దించిన మఱ్ఱిచెట్టు సుబ్బరాజుగారి కళ్ళాన్నంతా ఆవరించుకొని వుంది. రాజుగారి గేద పాలంగట్టున దొరుతుంది. పడమట కొండల్లో సూర్యుడు పొంచుంటున్నాడు. వెంకడు గరువుమీద గీకి తెచ్చిన పచ్చపరకలు కళ్ళంలో కూర్చుని మట్టి దుళ్ళగొడుతున్నాడు. అదే వేళకు సూర్యుడెప్పుడూ ఆ కొండకొసకు చేరుకోవడం, వెంకడు కళ్ళంలో గడ్డిపరకలు దుళ్ళగొట్టి, పశువులను మర్రిచెట్టు వేళ్ళతో కట్టి కాస్త కాస్తన్ని పరకలు వేసి దువ్వడం యథాలాపంగా జరిగేదే.

కానైతే రెండు రోజులయింది వెంకడు కళ్ళానికే వెళ్ళలేదు.

ఆ గ్రామంలో రాజులు మొఖాసాదార్లు. రెండు పుంజీలిళ్ళుంటాయి, వాటిని లోవుళ్ళంటారు. ప్రతీ లోగిలికీ చుట్టూ చిన్న ప్రహరీగోడలు, ఆ గోడలన్నీ మట్టిగోడలే, వాటిమీద పోసిన శ్రావణీ వర్షాలకు కరిగిపోయిద్ది. అక్కడక్కడ తిరగబడ్డ బోడి గోడల్ని మళ్లీ మరామత్తు చేసుకోనేలేదు.

వెంకడి చిన్నతనంలో ఆ అవరణలనిండా మైసూరెడ్లూ, కాశీ గేదెలూ, ఒంగోలు దూడలూ వుండేవి. యిప్పుడో! కళ్ళంలో నాలుగు జతలు బక్కలయినా పుష్టిగా కనుపించడం లేదు. మొఖాసాదార్ల దొడ్లన్నీ ఎందుకలా క్షీణించిపోయాయో అర్థం అవడం లేదు.

వెంకడు సుబ్బారాజుగారి సేరీలో పాలికాపుతనం చేస్తున్నాడు. కొడుకు గురవడు పట్టుమని పదేళ్ళయినా నిండలేదు. పెంకి గుంటడు కొబ్బరి సామ్మల్ని (గొడ్లు) తిరగ్గొట్టుకొస్తున్నాడు. తండ్రి పేరే పెట్టుకున్నాడు. కొడుకు నప్పుడప్పుడు తూకలేస్తూ వుండేవాడు.

"రంగాన్ని బరమాదానితో ఏడిసివాడు నీ తాత. కొన్నబ్బులైనా వొట్టుకు రానేదు, పైగా వొట్టుకొచ్చిన బొక్కసాలు రెండూ రాజాగోరి బాకీ తీర్చడానికే వొచ్చినై కావు, ఏ పొద్దు కూలిసేత్తే ఆ పొద్దే వొల్లకతాగి తందనాలాడోడు, నువ్వు ఆడాన్నే కొలుసుకులిందావని సూస్తన్న వేటేయ్" అని గసురుతూ వుండేవాడు.

వెంకడి తల్లీ తండ్రీ చనిపోయేరు. పెళ్లాం కాపురానికొచ్చి పన్నెండేళ్లయింది. యిప్పుడు పలుగురు పిల్లలూ, అంతా మొగగుంట్లే, గంగి కూడా సేరీలో పనకపాటు చేస్తుంది. సూర్పని గింజలు మట్టించి, గాలి పోత పోసి గరిశెలో గింజలన్నీ ఎత్తి రాజాగారి లోగిట్లో కప్పెడతెప్పేడు. గంగి పొద్దస్తమానం కళ్ళం అంతా తుడిచి బెడ్డల్లో రాలిన ధాన్యపు గింజలను గుడ్డతో కత్తుకుని ఏరితెచ్చుకుంటే, ఏడుం గింజలయ్యాయి. కమ్మగా వరికూడొండి, పరిగెల పులుసుతో తల్లీ పిల్లాద్రీ తిని, మురిసిపోయేరు.

వెంకడి పితృ పితామహులు పాలికాపు పనే చేశారు. యింక చెయ్యగలిగింది లేదు పొట్ట గడవాలంటే పాలికాపు పనే చెయ్యాలి - కానైతే ఏ తప్పూ లేకుండా కాస్త ఆలస్యంగా సేరీలో కొచ్చేడని రంగబాబు వెంకడిని పశువుని బాదినట్టు కొడితే సహించగలడా!

## పూసపాటి కృష్ణంరాజు

అందుకే వెంక డుండిపోయేడు. పాలికాపుతనం మానేశాడు. సుబ్బరాజుగారితో చెప్పకున్నా వినందే.. తలనొప్పు, జ్వరంతో వళ్ళు కాలిపోతుంటే, వెళ్ళలేక వెళ్ళలేక వెళ్లేడు. అందుకోసం కొడతాడా!

రంగబాబు వేషాలన్నీ తనే దాచిపెట్టేడు. పాలీపేటలో వున్న "సూరి"ని బారామాసి తోటకు తీసుకు రమ్మని తనకి చెబుతాడా! అప్పుడే అన్నాడు.

"పినబాబుగోరూ, మీకు కుండెత్తేసిన పనైగాని, ఎంత పాలికాపునైనా అలాటి పని సెయ్యమని సెప్పొచ్చటండీ? నేనేటి మీ కంత యవారంగా కనొస్తున్నానా! నా కళ్ళముందు పుట్టినోరు... రానియ్యండి పెదరాజుగోర్ని, ఆరితో సెప్పి మీ యాపారం కట్టిస్తాను." అంటే రంగబాబు అప్పటికి బ్రతిమాలి తండ్రితో చెప్పొద్దని వొట్టేయించుకున్నాడు, వెంకడు ప్రమాణికం చేసేడు. ఆ విషయం సుబ్బరాజుగారితో చెప్పనేలేదు ఆ కోపం వుంచుకున్నట్టుంది, అందుకే కొట్టేడు. అయినా వెంకడ్ని సుబ్బరాజుగారు కళ్లందిబ్బ త్రొక్కొద్దన్నారు. అంత ఖచ్చితంగా చెబుతారా! అందుకే వెళ్ళలేదు మాలపల్లె గుడిశెలో నులక మక్కిమీద పడి దొర్లుతున్నాడు.

మాలపల్లెలో జనం వుండే వేళకాదు. అంతా కూలీ నాలీ చేసుకు నేందుకుపోయేరు.

గంగి చేతి గుంటశివి, చిరిగిన కోకతో ఉయ్యాలకట్టి, చూరుకి వేలాడేసింది. వేలాడేసి, పొయ్యిలోకి తొక్కురితెచ్చుకోవడం కోసం ఎక్కడికో వెళ్లింది.

వెంకడు మక్కలో కూర్చుని ఏం చెయ్యడమా అని ఆలోచిస్తున్నాడు. వెంకడు కూడా ఆలోచించగలడా!

వీధిలో గుంటలంతా ఒక్కసారి వెంకడి గడిశలో దూరేరు. దూరుతూనే, "ఎంకో, ఎంకో!" రాజగోర్లొచ్చి జంతిలో వున్నారె, నిన్ను పిలమన్నారోయ్. అని కేకలేసేరు. వెంకడికేమీ అర్థం కాలేదు. లేచి గుడ్డ సర్దుకుని గుడిసెముందు కొచ్చేడు. రాజులంతా గుడిసెముంగుకు రానేవచ్చేరు.

పెదబాబు దర్జమని వెంకడిగుడిశెకి దూరేడు. అక్కడంతా వెతికేడు ఏముంది? నాలుగు మురికిపాతలు రెండు చింకిగోనెలు కాటిపుండా అంబటి దాకాను.

గంగి తెచ్చుకున్న గింజల్లో యింకా యిద్దుంగింజలవరకూ మట్టిజాడీ అడుగున వున్నాయి పెదబాబు వాటిని కూడా కెలికి చూసేడు. అన్నీ చూసి పెదవి విరుస్తూ జంతిలోకొచ్చేడు. చిన్నపిల్లలంతా విస్తుపోయి చూస్తున్నారు. వెంకడి పిల్లలిద్దరూ ఎక్కడో గోర్జలో మట్టిగూళ్లు కడుతూ ఆడుకుంటున్నారు

వెంకడిప్పుడు దొంగ. జగన్నాథరాజుగారియింట్లో వస్తువులు పోయేయి. అందుకే వెంకడిల్లంతా తనిఖీ చేసేరు.

"ఎక్కడ పాతిపెట్టేవో చెప్పు? లేకపోతే దుమ్ములిరుగుతాయి" అని సూరపరాజుగారు గదమాయించేరు.

"నాపిల్లలమీన వొట్టేసి నా నేపాపం ఎరగనుబాపూ యిన్నేల్లబట్టి చేరీల్లో మెసులు



బుద్ధవిగ్రహం (బరోడా)
ఫొటో: టి. బి. కృష్ణరావు—బరోడా.



# సామంతం



కొస్తున్నాను ఏనాడన్నా ఎంకడిలాటోడని యిన్నారా?" అన్నాడు వెంకడు.

"రోజులెప్పుడూ ఒక్కలాగేవుంటాయా ఏదో పాడుబుద్ధి పుట్టింది. అయిందేదో అయింది యిచ్చేద్దూ" అని రుద్రరాజు గారు వెంకడిమేలుకోరి చెప్పేరు.

"అన్నీ తెలిసినోరు తమరలాగంతేనా వేగాతంలో దూకనుబాపూ! నాను తియ్యనేదంతే...." అన్నాడు.

"నువ్వెన్ని చెప్పు లాభంలేదు అర్ధరాత్రి వేళ గోర్జిలో ఒక్కడివి ఏంచేస్తున్నావు? బాబడిగితే నవుగుతూ జవాబు చెప్పావట కదూ. అసలు రాత్రి నువ్వెందుకొడ్లోగిటి కైపువెళ్ళేవు? వీడినిక అడిగి లాభంలేదు కళ్ళానికి యీడ్చుకురండి అక్కడ చెప్పిస్తాను" అని సూరపరాజుగారు ఆజ్ఞాపించి చెపాటిక్రర బుజాన్ని వేసుకుని చరచరా అంగలు వేసుకుంటూ వెళిపోయేరు.

వెంకడినితీసుకుని అంతా కళ్లంచేరుకున్నారు. మాలపల్లె గుంటలు రావడానికి సిద్ధం అయేరు. పెదబాబు వాళ్ళందర్నీ గదమాయించి పొమ్మన్నాడు. కొంతమంది గంగిని వెతుకుతూ వెళ్ళేరు.

మొన్న నేదో గసిరేనని బెంక పెట్టి 'యిక మీపనిలోకి రానెల్లండే' అనుకుంటూ అందుకే విసురుగా వెళిపోయాడోయి" అన్నారు సుబ్బరాజుగారు, సూరపరాజు గారితో.

"దొంగసొమ్ము దొరుకుతే యిక పాలి కాపుతనం ఎందుకూ?" అని ప్రతాపరుద్రులు ఎత్తిపొడిచేరు.

వెంకడి కళ్లనుండి అశ్రువులు భూమిమీద టప్‌మని రాలేయి. గొంతుకంతా పిడచకట్టుకపోయింది. సుబ్బరాజుగార్ని మిడుతూ మిడుతూ చూస్తూ అలాగే నిలుచున్నాడు.

"చెప్పు ఎక్కడ దాచేవో చెప్పు, చెప్పరా వెధవ్వేషాలూ నువ్వూను" సుబ్బరాజుగారే అడిగారు.

వెంకడి కళ్ళముందు యావత్తూ కారు చీకటిగావుంది. సుబ్బరాజుగారి దగ్గరే తను తల్లిపిల్లాద్రీ నౌకరీ చెస్తున్న దిను తనప్పుడే ముప్పై సంవత్సరాలబట్టి పనిచేస్తున్నాడు. దొంగననిపించుకున్నాడు? యిప్పుడు వారి పనిలోకి వెళ్ళడంలేదని, తనను పచ్చి దొంగగా జమేసి మాట్లాడతారా?

"పెదరాజుగోరూ! తమర లాగంతారని నా జనమలో అనకోనేదండి." అన్నాడు.

"గాడిదకొడకా దిగుల్నాబజీ కబుర్లు చెప్పక ఎక్కడవుందో చెప్పు మొత్తం పదహారుతులాలు అణా బేడా కాదు, పోతేపోయిందని వూరుకోవడానికి. నువ్వుతీసినట్టు రుజువులన్నీ అవుపిస్తూనేవున్నాయి" అని సూరపరాజుగారు మధ్యలో కలుగజేసుకున్నారు.

"అవునోయి సూరన్నా! గొలుసు వడ్డాణం రెండు జతలగాజులున్నూ; బొట్టు పెట్టిలో చిన్న చిన్న వెండి భరిణలవీవున్నా అవి మళ్ళా తీసుకోలేదు సుమా! ఆ పెట్టితో అవన్నీ తోట పెండిదగ్గర బద్దలగొట్టి పారేశాడు, ఆ చూపుచూడు దొంగముఖం వాడూను." అని జగన్నాథరాజుగారు చెప్పినవే ఏకరూ పెట్టారు.

"వీడిలా చెబుతాడా! వుండండి చెప్పిస్తాను" అని సూరపరాజుగారు వెంకడి వీపు మీద పచ్చితాటి మట్టతో బలంగా కొట్టేరు. వెంకడు పారిపోదామన్నా చుట్టూ పది పంది రాజులూ గుడికట్టుకొనున్నారు. తియ్యలేదు మొర్రో! అన్నా ఎవరూ వినంరే. సూరపరాజుగారు అదేపనిగా మట్ట తోనూ కాళ్లతోనూ చేతులతోనూ వెంకడిని కొట్టి కొట్టి అలసిపోయారు

"నూస్తావేటి పెదబాబూ! అందుకోక పిలక" అని ప్రతాపరుద్రులు పెదబాబుని పురికొల్పేరు పెదబాబు మట్టతో వెంకడి వీపు రక్తమయం చేసేడు.

వెంకి డెన్ని కేకలేసినా వారికి దయ పుట్టందే! లాభం లేదు చెప్పకపోతే ప్రాణాలు నిలువునా పోవలసిందే.

"బాబోయ్ సంపేకండె సిన్నం నాయుడు కళ్లంలో గడ్డి మేటులో ఎట్టేను" అని చెప్పేడు.

"పద ఎక్కడుందో చూపించు" అన్నారు ప్రతాపరుద్రులు.

వెంకడు నడవ లేనన్నాడు.

"మాశారా దొంగఎత్తు లేస్తున్నాడు పదండి లాక్కెస్తాను" అని పట్టుకున్నాడు బాబు.

వెంకడు కాళ్లు ఈడదీసుకుని తడుముకుంటూ సిద్ధం అయేడు. అంతా వెంకడిని తీసుకుని చిన్నంనాయుడు కళ్లం దెప్పిమీదకు చేరేరు. నాయుడు కళ్ళంనిండా గడ్డిమేట్లు నిండుగా వున్నాయి. నాయుడు కళ్లంలోనే వున్నాడు. రాజులంతా రావడం చూసి ఎదురుగా వచ్చేడు. చిన్నంనాయుడికి వింతగానే వుంది. ఎందుకీ రాజులంతా యుద్ధానికొచ్చినట్టు వస్తున్నారు. నీటిదగ్గర తగవులు రావడానికి తనది జిరాయితీ, రాజుల్ది మొఖాసాను రెంటికీ వేరేవేరే చెరువులున్నాయి తనెప్పుడూ రాజుల్తో తగవుకి దిగలేదే! వెంకడు మూలుగుతూ కనుపించేడు వెంకడిని కొట్టినట్టున్నారే! ఎందుకు చితకొట్టారు చెప్మా!

"చిన్నంనాయుడూ! చూశావా? వెంకడి ఉద్యోగం! జగన్నాథం అన్నయ్యగారి లోపల్లో కన్నంవేసి, వస్తువులు తెచ్చి నీగడ్డి మేట్లో పెట్టాడట!" అన్నారు సూరపరాజుగారు.

చిన్నంనాయుడికంతా అగమ్యగోచరంగా వుంది.

"ఏ మేటులో పెట్టేవు?" జగన్నాథరాజుగారడిగేరు.

"అందులోనే" అని వెంకడొక చుట్టుమేటు చూపించేడు. అంతా గడ్డిమేటు చుట్టూ చేతులుపెట్టి వెతికేరు. ఎక్కడా లేదు మేటు తిరగవేసి ఒక్కొక్క గడ్డిపరకనూ గాలించేరు.

అందులో ఏముంది? గడ్డిపప్ప తిరగవేస్తున్నప్పుడు మాత్రం గోధుమనాగు ఎండిపోయి గడ్డిలో చొచ్చుకుని బయటపడింది ఎవరినీ ఏమీ చెయ్యలేదు శారణ్లో వున్నట్టుంది, పడగకూడా విప్పలేదు. పెదబాబు చేతికర్రతో నాలుగు బాదేడు. అప్పుడే చచ్చి పూరుకుంది

ఆ పాముని చూసి ఏదో కుర్రసంచీ అనీ, అందులోనే పోయిన వస్తువులుంటాయనీ, అనుకున్నారట సూరపరాజుగారు తీరా చూస్తే అది పాము! విషజంతువు! కరవలేదు గాని ఎంత పనయిపోను!

వెంకడి దొంగతనానికి యింకో ప్రాణం



రాజారాణి (భువనేశ్వరం)

ఫొటో: కరీముదీన్‌ఖాన్ — కటక్

నిలువునా పోవలసిందే వీడి దొంగతనానికి బలైపోవలసిందే. వీడి దొంగవేషాలిక కట్టిబెట్టు లేవు — అని అంతా భగ్గుమన్నారు

అందరిలోనూ వెంకడు దొంగ, గజదొంగ అనే భావం గట్టిగా నాటుకుపోయింది.

వెంకడినంతా కలిసి సుబ్బరాజుగారి కళ్లానికి తిరిగి తీసుకొచ్చేశారు. కళ్లంలో మఱ్ఱిచెట్టు ఆకుల్ని గలగల్లాడించింది. ఏపుగా పెరిగిన కొమ్మకు కట్టిన ఉయ్యాల గాలిలో వూగింది.

వెంకడి రెండుకాళ్ళొకటి కాళ్లు మీదకూ శిరస్సుకిందకూ వేలాడగట్టించేరు పెదబాబు చెట్టెక్కి తాడు మీద మీదకు లాగి వెంకడిని అటు ఆకాశానికీ యిటు భూమికీ కాని విధంగా ఆడించేడు.

సూరపరాజుగారు ఉగ్రరూపం దాల్చి వీరావేశంతో వెంకడిని అలావుండగానే వళ్ళంతా హూనం చేసేరు. పెదబాబు గాలిలో వూపుతూ బలంగా పెరిగి బ్రహ్మరాక్షసి కథలోవున్న మఱ్ఱిచెట్టువంటి ఆమఱ్ఱిచెట్టు మానుతో వెంకడి బుఱ్ఱ ఢీకొట్టించేడు. అమానుషమైన ఆబాధను భరించలేకపోయేడు వెంకడు ఎన్నో కేకలు వేసేడు.

"నా నెరగను బాబో! నానెరగను తండ్రో! రచ్చించండి రాజుగోరో! నా నేకరము ఎరగను భగమంతుడా!" అని రోదన ప్రారంభించి బుద్ధినిర్రా రిగా కాలొప్పోయాడు. రక్తం శిరస్సుకు ప్రవహించి మైకం కమ్మిస్తూ, బాధ భరించ శక్యం కావడంలేదు ఏమున్నదీ కనుపించడంలేదు. శరీరం మఱ్ఱికొమ్మనుండి అటూ ఇటూ వూగుతుంటే వాడికొక్క భగవంతుడే గోచరిస్తున్నాడు.

ముక్కు చితికి రక్తం ప్రవహిస్తూంటే సొమ్మసిలిపోయేడు.

గంగి నెత్తిన కట్టెలమోపుతో గుడిశ చేరుకుంది. మాలపల్లె యావత్తూ వెంకడివిషయం పాక్కిపోయింది. వెంకడిని దూరంనుంచి చూసి హడలెత్తిపోయిన పిల్లంతా గంగితో "రాజులు వెంకిడిని కళ్ళంలో వున్న మట్టిచెట్టుకి కట్టి ఉరిపోసే'రని చెప్పేరు

గంగి హృదయం భిగ్గుమంది. లోకం అంతా నిద్రపోతున్నట్టయింది, కళ్లు చీకట్లు కమ్మేయి, గుండెలు బాదుకుంటూ కళ్లంవైపు పరుగెత్తింది. గంగిని అనుసరిస్తూ మాలపల్లె యావత్తూ కదిలింది.

వెంకడిని అక్కుపక్షిలా అక్కడే వుంచి "ఎక్కడ వస్తువులు దాచాడో చెప్పేవరకు కట్లు విప్పకండి" అని నూరపరాజుగారు వెళిపోయేరు. మిగిలిన రాజులంతా ఒక్కొక్కరే జారుకున్నారు. వెంకడి బొందెలో ప్రాణం వున్నదీ లేనిదీ చెప్పడం కష్టమే.

గంగి గొల్లున ఏడుస్తూ కళ్లం దిబ్బమీద అడుగుపెట్టింది, గంగితో వచ్చిన మాలపల్లె జనం యావత్తూ భయంతోనూ, విస్మయంతోనూ వణికిపోయింది. వెంకడి కట్లువిప్పి ముఖంమీద నీళ్ళు చల్లేరు.

వెంకడి కన్నెళ్లు గడిచినై ఎప్పుడూ ఎవరిచేతా పల్లెత్తుమాట పడలేదు. వెంకడెప్పుడూ మాలపల్లె రచ్చరాయిమీదనైనా పడుంవాల్చలేదు. ఎప్పుడూ రాజుగారి సేరిలోనో, తన పాకలోనో పడివుండేవాడు. ఒకరి వూసూ జోలీ ఎప్పుడూ పట్టించుకునేవాడు కాదు. ఆ వెంకడికి యీ శిక్ష!

వెంకడింకా ఊపిరి తీస్తున్నాడు; బ్రతికే వున్నాడు.

"యింత గోరం ఏనాడన్నా వుందా! రాజులు మతులు పోనాయి, వుట్టి పున్నానికి ఆడి జీవాలు తీసినారు" అన్నాడు కాపుడు.

"అలా వొల్లకుంతే ఎనాగయ్, ఏదో వొకిటి సెయ్యాల గని" అన్నాడు.

"మునసబు నాయుడు గుమ్మంమీనొడీసి ఆరిసే అడుగు దాం పదండేస్" అని రావుడో నిర్ణయానికొచ్చేడు.

అంతా కలిసి వెంకడిని మునసబు నాయుడు అరుగుమీదకు చేర్చేరు. గంగి చంటిబిడ్డడితో వెంకడిమీదపడి ఏడుస్తోంది. మునసబు వచ్చి అంతా తెలుసుకున్నాడు. కానైతే ఏమి చెయ్యడమో పాలుపోవడం లేదు.

మునసబు రాజుల చేతిలో మనిషి. వారి పలుకుబడీ మునసబునాయుడి తండ్రి తాతల నుండీ వస్తూనే వుంది. యిప్పుడీ వెంకడినీ మాలపల్లెనూ వెంటబెట్టుకుని కచేరిలకూ పోలీసుస్టేషన్లకూ తిరగడం ఎలాగ? రాజులంతా తనమీద కట్టుకడితే చాలగలడా? ఆలోచించేడు. వెంకడు తన గుమ్మంలో ప్రాణాలువిడుస్తే? ప్రభుత్వం కొలువు వుంటుందా! అధికార్లు వూరుకుంటారా? మాలపల్లె యావత్తూ గుమ్మంముందుపడి కొసుకూర్చున్నారే. ఏమయితే అదే అయిందని వెంకడిని ఆసుపత్రికి డోలీకట్టించి తీసుకెళ్ళేడు.

వెంకడిని మునసబునాయుడు పట్నం ఆసుపత్రికి పట్టించుకెళ్ళేడని, పోలీసు రిపోర్టు కూడా యివ్వవచ్చునని నూరపరాజుగారికి తెలిసింది. వెంటనే నలుగురిరాజుల్నీ చావిట్లో సమావేశపరిచేరు.

"యిప్పుడు కర్తవ్యం ఏమిటి? వెంకడి ప్రాణాలమీద కొచ్చిందిట. మునసబు ఆసుపత్రికి మోయించుకెళ్లేడు. వాడు చస్తే ఎలా వస్తుందో! ఆలోచించండి" అని "ఎజండా" వేసేరు.

పెదరాజుగారు నలుగురిలోనూ పలుకుబడీ కలిగిన వ్యక్తి. ఆఫీసర్లనందరినీ ఆయనకు బాగా తెలుసు. ఆయన వ్యవహారాలమీద కర్నూలు వెళ్లేరు. స్వతంత్రించి ఏపనైనా చెయ్యడానికి తక్కినవాళ్లకు చేతకాదాయె. యిప్పుడే వచ్చింది, యీ అఘాయిత్యమూను! ఏమిచెయ్యడం?

అంతా ముఖముఖాలు చూసుకున్నారు.

"మీరేం భయపడకండి అన్నీ నేను చూస్తాను" అని పక్రరాజు లేచేడు. పకీరు అందరికంటే కొస్త బుఱ్ఱ వుపయోగించే మనిషి. అంతా అతనివైపు ఆశతో చూసేరు.

"మనిషి రెండొందలచొప్పున యివ్వండి. డబ్బులేకుండా పని జరగదు" అన్నాడు, పకీరు.

"అవును. డబ్బుండాలి" నూరపరాజుగారు ఖాయపర్చేరు.

అంపెరి ముఖాలు వెలవెలబోయేయి. నా దగ్గర రొఖ్ఖం లేదంటే నావద్దలేదని, అంతా అన్నారు.

"షావుకారిదగ్గర అంతాకలసి మొత్తంగా నోటురాస్తే అదేవస్తుంది" అన్నాడు పకీరు.

అందరికీ అది బాగున్నట్టే తోచింది. షావుకారు వచ్చేడు. వున్నపాళంగా రెండు వేలు కావాలన్నారు.

"నూటికి పదిరూపాయలిచ్చినా తక్షణం జతపడ్డం కష్టమే" అని బెట్టులేసేడు. పరిస్థితులన్నీ విని నూటికి ఐదురూపాయలవడ్డీ నిర్ణయించుకుని పత్రాలు వ్రాయించి పుచ్చుకుని మరీ యిచ్చేడు.

పక్రరాజు సొమ్ము పట్టుకుని సైకిలుమీద వెళ్లేడు.

హాస్పటిల్లో డాక్టరుగారు కేసు ఎక్కడి నుండి వచ్చింది తెలుసుకున్నారు.

పెదరాజుగారు ఆయనకు చిరపరిచితులే. వెంకడిని పరిక్షించి మందులువేసి కట్లుకట్టేరు. వెంకడికి ఊపిరాడింది. డాక్టరుగారికి ధైర్యం చిక్కింది.

మునసబుని పోలిసు రిపోర్టు యివ్వమని రావన్న తొందరచేసేడు. మునసబు ఆలోచనలతో మొత్తుకుంటున్నాడు.

కాలం ఆగలేదు.

పక్రరాజు రానేవచ్చాడు.

"ఎలా వుంది మునసబూ?" అనుకుంటూను.

"డాక్టర్లుగారు యింజక్షన్ యిచ్చేరు, ఏమీ చెప్పలేదు" అన్నాడు మునసబు.

పకీరు డాక్టరుగారితో విషయాలన్నీ చెప్పేడు, డాక్టరుగారు ధైర్యం చెప్పి జాగ్రత్తగా వుండమని వెళిపోయేరు.

పకీరు రావన్నను పిలిచేడు, మునసబు అందరినీ కూడగట్టుకొచ్చేడు. పకీరు రావన్న చేతిలో పది పులిబుఱ్ఱ లుంచేడు.

"నాకెందుకు బాపూ? యిదంతాను," అని అన్నాడేగాని డబ్బు చేతిలో నేవుంది.

"వాళ్ళ నందరినీ తీసుకెళ్లి తిళ్లు పెట్టించు తరవాత చూద్దాం, నేనూ మునసబూ పోలీసు స్టేషనుకి వెళ్ళి రిపోర్టు యిచ్చివస్తాం" అని చెప్పేడు పకీరు.

రావన్న నమ్మినదీ లేనిదీ తెలియదు కాని, మెదలకుండా అందరినీ కూడగట్టుకుని హోటలుకి వెళ్లేడు.

పకీరూ, మునసబూ "మిలతరీ రాజుల

భోజన హోటల్లో” పులావు తిని త్రేన్చుకుంటూ వచ్చేరు.

గంగి వెంకడి వంటి పెట్టుకు నేవుంది. పచ్చి మంచినీరు కూడా ముట్టలేదు.

రాత్రి ముదిరింది.

వెంకడికి లౌకిక చింతన తిరిగి ఏర్పడే సరికి బళ్లున తెల్లవారింది.

గంగి కప్పడే కునుకుపట్టినట్టుంది. చిన్న గుంటడు తల్లి శిరాన్ని కరమకొని కలలు కంటున్నట్టున్నాడు. గంగి ముఖంమీద కన్నీటి చారలు వెంకడికి స్పష్టంగా అవుపించెయి. భౌతికంగా పడ్డ యాతనంతటి కంటే యీ కన్నీటి చారలతని కెంతో దుఃఖం కలిగించేయి. పిల్లలమీదకు మనస్సు పోయింది తనేదో ఘోరం చేసినట్టు బాధపడ్డాడు, తల తిరిగిపోయింది. ఆసుపత్రి వరండాలో వరుసగా మంచాలమీదనున్న రోగుల మూలుగులు అస్పష్టంగా వినిపించేయి. చిన్న మగత కమ్మింది మళ్లా జ్ఞప్తి పోయింది.

పకీరు ఉదయాన్నే గ్రామం వచ్చేడు. అందరూ అతని చుట్టూ ఆత్రుతతో మూగేరు.

“ఎబ్బ మంచినీళ్ళలా ఖర్చుపెట్టేను అందర్నీ కట్టేశాను, వెంకడి మాట రిపోర్టు యిస్తానన్నాడు, ఐదువందలిచ్చి ఆపుచేశాను” అని చెప్పుకుపోతున్నాడు. అంతా నోళ్లు తెరచి ఆలకించేరు, వెంకడు బ్రతికి వున్నందుకూ, ఆపద తప్పినందుకూ, స్థిమిత పడ్డారు. పకీరు తిరిగి పట్నం వెళిపోయేడు.

కొంతమంది రాజులుకూడా పట్నం వెళ్లేరు, ఆసుపత్రిలో వెంకడిని చూసి చింతించేరు, గంగి అతి బలవంతంమీద గుక్కెడు గంజి త్రాగింది. మనస్సు కుదుట పళ్లేదు. గురవడు వచ్చేడు, తండ్రినీ తల్లినీ చూసి బావురుమన్నాడు. గంగి హృదయం నీరయింది.

రాజులంతా గంగి నోదార్చేరు. పిల్ల నిద్రగినీ సీతకి వప్పజెప్పేమని, వేళ మంచిది కాదు ఏదో అయింగనీ పరిపరి విధాల చెప్పేరు.

తిరిగి గ్రామం పోక, మధ్యలో క్రొత్త తెలుగు చిత్రం ఆడుతుందని చూసి పోదామని ఆగిపోయేరు.

*   *   *

సంధ్య వేళ పట్నంనుంచి ఎట్టాబత్తుడు గ్రామంలో కొచ్చేడు, చావిట్లో సూరపరాజు గారూ, జగన్నాథరాజు గారూ కూర్చొనున్నారు.

ఎట్టాబత్తుడు వస్తూనే “కొంప మునిగి పోయింది బాబయ్యా! ఎంకడాసుపత్రిలో ప్రాణాలొదిలేసినాడు, పోలీసోళ్ళు గాలేసినారు, అడ్డికొస్తన్నారు కూడాను, నాను మాడ్డేక పారొచ్చినాను” అని విన్నవించేడు. రాజులిద్దరి ప్రాణాలూ నిలువునా ఎగిరిపోయినట్టు అదిరిపడ్డారు. నిర్ఘాంతపోయేరు.

విషయం అందరిలోపుళ్లలోనూ పాక్కుపోయింది

పట్నంవెళ్ళిన రాజులంతా జెయిళ్ళ కటకటాలలోనుండి గజాలకు బుజ్జాలు కొట్టుకుంటున్నట్టు, కూనీ కేసు విచారణ జరిగిపోయి అందరినీ నల్లటి ముసుగుల్తో ఉరి త్రాటిముంగుకు తీసుకువెళుతున్నట్టు వాళ్లు “అయ్యో!” అని కేకలు వేస్తున్నట్టు వూహించుకుని; ఆడవాళ్లంతా వింతవింత స్వరాల్తో రాగాలు పెట్టి, ఏడుపుల్తోనూ పెడబొబ్బలతోనూ లోపుళ్లనన్నిటినీ ఎగరగొట్టేరు.

భరించ శక్యం గాని వింతప్రకృతి అక్కడ తాండవించింది. అది కొన్ని క్షణాలు కాదు గంటలు కొనసాగింది సినిమా చూసి రాజులంతా పదిగంటలరాత్రికి నిక్షేపంలా యిళ్లకు చేరుకున్నారు. ఆ అంకం ముగిసింది. ఎట్టాబత్తుడు పుకారు పుట్టించేడని తిట్టుకున్నారు. అన్ని ముఖాలూ వికసించేయి రాజులు చేతులను మీసాలమీదకు పోనిచ్చేరు. చీకటి గాఢంగావున్నా అందరి మనస్సుల్లోనూ వెలుగులు ప్రకాశించేయి.

గంగి పదిరోజులూ పట్నం ఆసుపత్రిలో నేవుండి వెంకడిని బ్రతికించుకుంది. పకీరు డాక్టరుగారి ఫీజు చెల్లించి వెంకడిని జటకాబండిమీద పంపించేడు.

వస్తూన్నప్పుడు గంగి అడిగింది. “అయితే నువ్వు తీస్తే ఆ బంగారం యాడెట్టినావేయ్” అని.

వెంకడికి వళ్లు మండెక్కిపోయింది.

“నువ్వుకూడా నన్ను దొంగకిందే జమేసినావటే?” అన్నాడు నిట్టూరుస్తూను.

గంగి ఎందుకన్నానా అని నొచ్చుకుంది. వెంకడికు కిశముందు నులకమంచం గులిపి రావు జొచ్చివేసేడు. పిల్లలు వలుగురూ మంచంఎక్కి వెంకడిని తడుముకుంటూ మురిసిపోయేరు.

రుద్రరాజు గారు పట్నంవెళ్లి తిరిగొచ్చేరు. వస్తూనే చావిట్లో కొచ్చి పడ్డారు. నలుగుర్నీ కేకలేసి పిలిచేరు, జగన్నాథం పెద్దకుమారుడు బంగారం బాబు ఎక్కడున్నాడో పిలమన్నారు. ఎక్కడా పత్తాలేడు. ఏ మావిడితోట పెండెల్లోనో వుండివుంటాడు, రహస్యం బయటపడింది, ఆ పోయిన వస్తువులు మార్వాడీదగ్గర వున్నాయట!

రుద్రరాజు గారు షావుకారికి జాయింటుగా వ్రాసిన ప్రోనోటుబాకీ చెల్లించడానికని వున్న నాలుగు సరుకులూ తాకట్టు పెట్టడానికి వెళితే తెలిసింది.

జగన్నాథరాజు గారి కొడుకే నాలుగు వందలకు తాకట్టు పెట్టాడట!

సుబ్బరాజు గారు దిగ్గున లేచేరు. అంతా నిర్ఘాంతపోయి చూసేరు.

ఆయన తిన్నగా మాలపల్లె వెళ్ళేరు. వెంకడు అమాయకుడని రుజువయింది.

వెంకడిని స్వయంగా సుబ్బరాజు గారే సేరికి రమ్మని పిలిచేరు వెంకడు పాలికాపుతనంలో తిరిగి ప్రవేశించేడు. సుబ్బరాజు గారు వెంకడిచేత గేదెను దూడ పెయ్యల్ని ఆదివారం సంతకు తోలించుకు వెళ్లేరు.

షావుకారి అప్పు తీర్చకపోతే వడ్డీ పెరిగి పోదూ! అందుకని గొడ్లను సంత చేశేరు. అమ్మకం అయిపోయేయి. రాజు గారు జట్కామీద వెళిపోయేరు.

వెంకడు కాళ్ళీడ్చుకుంటూ కళ్ళం చేరు కున్నాడు. కట్టుతాళ్ళూ, కన్నెలూ, మట్టి చెంబు తొట్టిలో జాగ్రత్త చేసేడు. సూర్యుడింకా పడమటకొండలమీదకు దిగలేదు.

వెంకడు గడ్డి బుంగా బొరిగా పట్టుకుని గరువుమీద పచ్చపరకలు గీకి తేవడానికి వెళిపోయేడు. షాఖాసాదార్ల దొడ్లలో పశువులెంగు కళా క్షీణించిపోయేదో? వెంకడి కర్థమయిందీ లేనిదీ చెప్పడం కష్టమే. ★

# రోలు గోల

## అ. సత్యనారాయణమూర్తి ('ఐసోలా')

జీవితంలో చిన్న చిన్న విషయాలు కూడా కొన్ని సమయాల్లో అత్యంత ప్రాధాన్యం వహిస్తాయని నేను ఒప్పుకుంటాను. ఒక హత్యాసందర్భంలో పెరటిచెట్టు కొమ్మకి చుట్టుకునివున్న జుట్టు వెంట్రుక సాధారంగా అపరాధపరిశోధక చక్రవర్తి హత్యచేసిన వానిని పట్టుకోగలిగాడంటే నేను నమ్మాను. అంతకంటె విపరీతమైన కథావిశేషాలు నా చెవి నెవరైనా వేసినట్లయితే కనుబొమ్మైనా ఎగర వేయకుండా ఓ మంచి ఘం వరకూ ఒప్పుకుంటాను.

కాని నెలరోజుల క్రితం ఎవరైనా "నీ జీవితంలో అతి త్వరలో రుబ్బురోలు, లేక రుబ్బురాయి, లేక క్లుప్తంగా చెప్పాలంటే వ్రిగోలు అతిప్రధానమైన విషయంగా అవతరిస్తుందంటే నేను సుతరామూ నమ్మేవాడినికాను.

నాకు జ్యోతిషంలో నమ్మకం లేదనడానికి వీలులేదు. ఆమాటకొస్తే ఆ శాస్త్రాన్ని ఈరోజుల్లో ఆరాధించే వాళ్లల్లో నేను ప్రథమ శ్రేణికి చెందుతాను. ఎంతసేపూ జ్యోతిష్కులు మంచిగురించే చెబుతూ, భాగ్యరాజ్యాధిపతి వడకలనే వస్తున్నా, అవి ఎన్నటికీ నిత్యజీవితంలో క్రియారూపంలో అనుభవంలోకి రాకపోయినా, నేను వేయిసంవత్సరాలు జీవించినప్పటికీ, చివరిసంవత్సరంవరకూ జ్యోతిషాన్ని నేను నమ్ముతాను. కాని మూడు వారాల క్రితం ఆదివారంనాడు దేశంలోని వార్తాపత్రికలన్నీ ఏకగ్రీవంగా నా విషయంలో "ముమ్ముందు రుబ్బురోలు ఒకటి నీ జీవితంలో అనుకోని ప్రాధాన్యంవహించే సూచనలు గోచరిస్తున్నాయని చెప్పడానికి సందేహించ నవసరంలేనట్టు కనబడుతూంద"ని ఎంత డొంక తిరుగుడుగా నా తలకి పట్టించడానికి పూనుకున్నప్పటికీ నేను దానిని తక్షణమే త్రోసిపుచ్చడమేకాకుండా జ్యోతిషంమీద వెయ్యేళ్లుండవలసిన నమ్మకం ఒక్కసారి పటాపంచలైపోయి ఈ వెయ్యేళ్లూ జ్యోతిషాన్నెవరూ నమ్మకూడదనే గాఢ ప్రచారం చేసేవాడిని.

ఈ నెలరోజుల్లో వంటింటిదగ్గర వుండవలసినరోలువచ్చి నా గుండెల్లో బైఠాయించిందనడంలో ఉత్ప్రేక్ష ఎంతమాత్రమూ లేదు. రుబ్బురోలు ప్రతి ఇంట్లోనూ ముఖ్యంగా వుండవలసిన వస్తువే. అది వుంటుంది కూడాను. అలాగే మా ఇంట్లోకూడా వుందని చెప్పడంలో వింతేమీ లేదు. కొందరు దానిని సంసారంలో ముఖ్యమైన వస్తువుల్లో ఒకటిగా జమకట్టుకుంటే తప్పుపట్టనవసరంలేదు. నా స్నేహితబృందంలో ఒకవ్యక్తి తనకి ఎనిమిదివందల మైళ్ళదూరం ఏకధాటిగా బదిలీ అయితే, ఆవూరిలో రుబ్బురోళ్లు దొరుకుతాయన్న సంగతి తెలిసికూడా అంతదూరం తను ప్రత్యేకంగా చేయించుకొన్న రాయిని పాత్రంతోసహా ఆవూరు దొర్లించాడు. ఎందుచేతనంటే అతనికి ఆవడలంటే మహాప్రీతి. సరియైన పాకంలో చేస్తే అంత తుష్టి పుష్టి కలుగజేసే వస్తువు మరొకదానిని బ్రహ్మ సృష్టించలేదన్నాడు. మినప్పప్పుని సరిగా నానపెట్టి తన దగ్గరవున్న రోలులోనే తగిన విధంగా రుబ్బి, సరియైన వేపు రాగానే తీసి, ప్రత్యేకంగా తయారుచేసిన పెరుగులో నియమితకాలం నాన్చి పుచ్చుకుంటే, చెప్పావు మజా, అంటాడు అతగాడు. ఈ వస్తుసముదాయంలో రుబ్బురోలు పాత్ర ఏమిటంటే తవ్వెడు పప్పుని, తను నలగకుండా, ఒకేసారి నలగకొట్టే శక్తిని కలిగివుండడంట. ఈ విషయంమీద సంగ్రహంగా ప్రజోపయోగంకోసం పుస్తకాన్ని కూడా ప్రచురించడానికి నడుంకట్టాడు నా మిత్రుడు.

మా ఇంట్లోవున్న రుబ్బురోలు బాగా కత్తిలాగ నలగడం లేదన్న సంగతి మా ఆవిడ కాకిచేతైనా కబురుచేసివుంటే, నేనెప్పుడో తగు చర్యతీసుకుని పరిస్థితుల నింత విషమరూపం దాల్చకుండా చేసేవాడిని. ఆ విషయం నేనే గ్రహించాలని మా ఆవిడ వూరుకోడానికి, రుబ్బురోలుకి సంబంధించిన పచ్చడులు, పచ్చడి ముక్కలు, ఆ పరికరం సహకరించడం లేదన్న సంగతి సూచాయగా నేనా ఇప్పటివరకూ తెలియజేయలేదు. పైగా ఆ వస్తువులన్నీ రుచికరంగా వుంటూన్నాయని అభినందన పత్రాలని కూడా సంతకాలు చేశాను.

ఈ విధంగా కథ వుంటూంటే నాభార్య మీద ఎంతో మమకారంగల ఒక ముసలి సంబంధం ఇంట్లో విడిది దిగి, ఒకనాడు నేను సాయంత్రం కొంచెం ఆలస్యంగా ఇల్లు చేరుకునేప్పటికి, మిగిలిన మంచిచెడ్డలు ముచ్చటించటం మరచిపోయి, "ఆడవాళ్లని ఇలా కష్టపెడితే వాళ్లు సంసారాలెలా చేస్తారు నాయనా! పొద్దుటినుంచి సాయంత్రం వరకూ సరదాగా బయట కాలక్షేపం చేసేవాళ్ళకి ఇంట్లో పడేవాళ్ళ అవస్థలు అర్థం అవుతాయా. ఇంటి విషయం బొత్తిగా పట్టించుకోకపోతే పను లెలా జరుగుతాయి?" అని అందుకుంది. సంగతేమిటో తుంచి చెప్పకుండా ఈవిధంగా దండెత్తిందేమిటిరా స్వామీ అనుకుని, అయినా ఈవిడ నాలుక మహా వాడి అన్న సంగతి ముందే తెలిసుండడంవల్ల, నేను ఆమాటల నాట్టే పట్టించుకోకుండా కొంచెం చిరునవ్వు ముఖంమీద తాండవింపజేసి "ఎప్పుడొచ్చారు? అంతా క్షేమమా! మిమ్మల్ని తరుచు తలుస్తూనే వుంటాము" అన్నాను.

"ఈ మాటల కేంకాని ఒక్క రుబ్బురోలు కొనిపడేస్తే ఈ బాధలుండవు కదా. పిల్ల నీతో కాకపోతే ఇంకెవరితో చెప్పుకుంటుంది? ఉన్న రోలుతో ఆవగింజ నూరడానికి ఆస్కారం లేదుకదా. నాకీ సంగతి ముందే తెలుసుంటే నేనే ఒక రాయికొని నెత్తినపడేసి డబ్బుకి పీకమీద కూర్చునేదాన్ని" అంది.

నా కళ్లు కొంచెం మసకలు కమ్మాయి. తలవనితలంపుగా తలవంచి ఒకసారి చేతితో తడుముకున్నాను. వ్యవహారం శ్రుతిమించినట్లు కనిపించింది "అగేమిటిసామ్మగారూ! మీరు ఇంతదూరం చెబుతున్నారు. రుబ్బురోలు చెప్పినమాట వినటంలేదని నాకు కాకిచేత కబురుచేస్తే ఒకటికాదు నాలుగు కొనిపడేసేవాడిని రాళ్లకి మహాభాగ్యమా! రవ్వలు, కెంపులంటే దచ్చకెక్కాలికాని, రోలు కింత గోలెందుకు" అన్నాను

"నాలుగు రోళ్లెందుకు, నెత్తినేసికొట్టుకోడానికి. పైగా నలభయి రూపాయిలు ఖర్చా! పదిరూపాయలు పడేస్తే పిచ్చయ్యదుకాణంనుంచి ఒకటి దొర్లించవచ్చుగదా" అని జవాబిచ్చింది. "పిండాకుకు లేకుండా పాషాణాలగొడవెందుకని నోరు నొక్కుకుని ముందు ముద్ద మింగి తరువాత తీరుబడిగా అన్నాను" నేనేదో రూపాయో అర్ధో వుంటుందనుకున్నాను. పదిరూపాయిలు పెట్టి ముందు రుబ్బురోలు కొనినా! ఉన్న దానితోనే ఏదో కథ నడిపిస్తేసరి. పైగా పిచ్చయ్యదుకాణం వూరికి మైలుదూరంలో

★ రోలుగోల ★

తగలడిందికదా. అక్కడినుంచి ఆ రాయి చేరేమార్గమేమిటి.

"రుబ్బురాళ్లి దుకాణం నువ్వు తగలేస్తే మాత్రం తగలడుతుందా. ఏదే నా కారులో పడేస్తే మూడు నిముషాల్లో చేరుతుంది. నాదగ్గర డబ్బులేదుకాని దీనికింత సేపా" అంది.

"మామ్మగారూ నేను పెల్లిగాం ఇవ్వడానికే నడిచివెడతానుకదా, రోలుకోసం కారు తీసుకురానా! దీనికింత మన్నన కూడానా! పైగా పిచ్చయ్య దుకాణంలోవి అన్నీ పిచ్చిరాళ్ళేనట. అక్కడ కొంటే నెత్తిన కొట్టుకోడానికేనా పనికిరాదుట." అన్నాను.

అంతే సుమండీ నేనన్నది. దాంతో ఆవిడ ఛర్రున లేచి రుద్రతాండవంలో కొన్ని కొత్త భంగిమలు ప్రదర్శించి, నాలుకని నూతన మారణమహాస్త్రాలకంటె వాడైనపదునుతో ఒకగంట విసిరింది. ఆ మారణహోమ మంత్రాలలోని పదజాలం విపరీతసమాసాలతో కూడుకుని, ఛప్పన్నభాషలూ తల క్రిందుగా తప్పజెప్పే పండితుడికి కూడా మాటపోయేటట్టుంది. వాడినమాట వాడకుండా, ఒకపదంకంటె మరొకటి మరీ ఘాటుగా వుండేటట్లు, ఆ మహాకవయిత్రి, నేటియువకుల్ని, వారి సంసారాల్ని, వాటితీరుల్ని దుమ్మెత్తిపోస్తూంటే నిశ్చేష్టుడనై నిలబడ్డాను. అలాగే నిస్త్రాణవచ్చి నిద్రపోయాను.

మర్నాడు పొద్దున్నే ఎక్కడినుంచో దూరంగా అష్టకాలు వినబడుతున్నాయి. "రుబ్బురోలేనా కొనుక్కోలేని సంసారాలు. కాఫీహోటళ్లమీద, సిగరెట్టుపీకలమీద డబ్బు ధ్వంసం చేయడమే కాని ఇంటి మొహాన్ని ఒక రుబ్బురోలేనా పడేయరు" ఈ ధోరణి నాకందని స్థాయిలో నడుస్తూంది. ముసలి ఘటం ఇల్లువదిలి వూరుమీద పడిం దేమిటిరా బాబూ అని మా ఆవిడ దగ్గిరకి పరిగెత్తికెళ్ళి ఏమిటీ గోల అని వురుముతే, వాళ్ళు మా ఇంటికి రెండిళ్ళ తరువాతి ఇంట్లోకి వాళ్ల రోలుతోసహా ఆ క్రితం దినమే కదిలినట్లు తెలిసింది.

ఇంక లాభం లేదని, తక్షణం కాఫీనీళ్లు గొంతుకలోపోసి, పరుగెత్తుకువెళ్లి ఒక టాక్సీ పట్టించుకుని వాళ్లింటిముందాపి, ఆ ముసలి ముద్దని అందులో కూలేసి, డ్రైవర్ని మధ్యలో ఎక్కడా ఆపకుండా నేరుగా పిచ్చయ్య దుకాణంమీదకి పట్టించమని, ఆవిడ స్వహస్తాలతో ఎన్నికచేసిన రాయిని తెచ్చి ఇంట్లో ప్రతిష్ఠాపన చేశాను. అంతటితో కొంత మనశ్శాంతి కలిగింది. అయినా అంతకు ముందురాత్రి ఆవిడ వాడైనమాటలకి నా శరీరమంతా కదలిపోయి పులకరం తగిలింది. ఆరోజు సెలవుపెట్టి ఆ మధ్యాహ్నం ఆ ముసలిమూట చేతిమీదుగానే ప్రారంభోత్సవం - అనగా పప్పు రుబ్బించి గార్లు వేయించి పుచ్చుకున్నాను. అప్పుడు తెలిసింది రోలు మహత్యం. ఇదివరకు తిన్న గార్లన్నీ ఒక ఎత్తు; ఈ రోలునుంచి తయారయివచ్చిం దొకటీ ఒక ఎత్తు. ఆవిడ కింత రోళ్ల అనుభవముంటే ఇంత గగ్గోలు పెడుతుందనిపించింది. ★




# విద్యావిధానములో ఆరోగ్యమార్గాలు

ఇల్లిందల సరస్వతీదేవి

బొంబాయి రాష్ట్రంలో ప్రాథమిక విద్యను నిర్బంధోచితము చేయవలెననీ, సంవత్సరానికి 1500 రూ. లకంటె తక్కువ ఆదాయము గలవారి బిడ్డలకు సెకండరీ విద్యకూడా ఉచితముగా గరపవలెననీ కొందరు శాసనసభాసభ్యులు కోరారు. 'పంచవర్ష ప్రణాళిక ననుసరించి విద్యాభివృద్ధి జరుగుతున్న'దని చెప్పి అభివృద్ధిని సూచించే లెక్కలూ వాటి వివరాలూ - శాసనసభలో వినిపించారు ఉపవిద్యామంత్రి.

హైదరాబాదు రాష్ట్రములో ప్రస్తుతము ఏడవ తరగతివరకు ఉచితముగా విద్యగరపబడుతున్నదనీ, ధనసౌకర్యాన్ని బట్టి పై తరగతులలో కూడా ఈ విధానము ప్రవేశపెట్టబడుతుందనీ విద్యామంత్రి శాసనసభలో అన్నారు.

ఈ రెండు ఉదాహరణలవల్ల ప్రజలూ ప్రభుత్వమూ నిర్బంధోచితవిద్యదగ్గర కొసరికొసరి బేరమాడుకుంటున్నారేమోనని పిస్తుంది. ఈ సందర్భములో ప్రభుత్వము విద్యకు తగినంత ప్రాముఖ్యము ఇవ్వటము లేదని ప్రజలలో కొంత అసంతృప్తికూడా ఉన్నది. 'ప్రజలకూ ప్రభుత్వానికీ ఆర్థికపరిస్థితులు తృప్తికరముగా ఉన్నప్పుడు, విద్యాభివృద్ధి సక్రమముగా జరుగుతుంది. అంతవరకూ మందకొడిగానే ఉంటుంది'ని కొందరు విద్యాభిమానులు నిస్పృహ చెందుతున్నారు. ప్రజలలో తొందరపాటు, విమర్శలు ఎక్కువవుతున్నాయని ప్రభుత్వము విచారపడుతున్నది.

ప్రస్తుతము ప్రజలదృష్టీ ప్రభుత్వదృష్టీ పాఠశాలల సంఖ్యను అధికము చేయటములోను, వీలునుబట్టి నిర్బంధోచిత విద్యను క్రమముగా ఉన్నతతరగతుల వరకూ అమలు పరచటానికి ప్రయత్నాలు చేయటములోనూ కేంద్రీకరింపబడి ఉన్నది. కాని ఉన్నంతవరకు పాఠశాలల అభివృద్ధిని గురించి, విద్యా విధానాన్ని గురించీ ఆలోచనలు సక్రమముగా సాగటము లేదు.

ప్రస్తుతము మన దేశములో పాఠశాలలు ఎట్లా ఉన్నాయి? విద్యావిధానము ఎట్లా ఉన్నది? ఒక్కొక్క పాఠశాలలో ఎందరు ఉపాధ్యాయులు నియమింపబడుతున్నారు? వారి పరిస్థితులు ఎట్లా ఉన్నాయి? విద్యావ్యాప్తి కావలెనని మనము ఎందుకు కోరుతున్నాము? ఇవన్నీ ఆలోచించి చూస్తే, మన పాఠశాలల పరిస్థితులు చెప్పుకోతగినంత మంచి స్థితిలో లేవని తోచక మానదు.

సగటున మన పాఠశాలలకు ఆరోగ్యకరమైన పరిసరాలలో, తగిన వసతులతో భవనాలు లేవు. అన్ని పాఠశాలలకూ కావలసిన ఫర్నిచరు లేదు. పాఠశాల అంటూ పేరుకు ఏర్పరచటము, ఇద్దరినో ముగ్గురినో ఉపాధ్యాయులను నియమించటముతో ప్రభుత్వానికీ ప్రజలకూ బాధ్యత తీరిపోతున్నది. వయస్సుకు తగిన దేహపుష్టీ ఆరోగ్యమూ సరిగా లేక - తినడానికి తిండిలేక - ఒంటికి గుడ్డలేక-ఈసురోమంటూ వచ్చిన విద్యార్థులూ, చాలీచాలని జీతాలతో - సాంసారికమైన చిక్కులతో సతమతమవుతూ - చిడిముడిపాటుతో వచ్చిన ఉపాధ్యాయులూ పాఠశాలలలో సమావేశమవుతున్నారు. పాఠశాలను పిల్లల మెదళ్లలోకి ఎక్కించేవరకే ఉపాధ్యాయుల బాధ్యత. విద్యార్థులకూ ఉపా

(30-వ పేజీ చూడండి)



చెరువుగట్టు

# విద్యావిధానములో ఆరోగ్యమార్గాలు

ధ్యాయులకూ ఒకరి ఊబుసు ఒకరికి పట్టదు. ఏడాదికొకసారి ఏ వైద్యుడో వచ్చి 'నీకు ఫలానా జబ్బు ఉన్న'దని చెప్పిపోవటమే గాని, ఆ వ్యాధి నివారణకు తగిన సౌకర్యాలను బిడ్డలకు కల్పించే బాధ్యత ఎవరికీ లేదు. దేశములో ఉన్న వికలాంగులూ దీర్ఘరోగులూ ఈమాత్రపు వసతులకుకూడా నోచుకోలేదు. సంతానములో ఒక దీర్ఘరోగి ఉన్నా, వికలాంగుడైన ఒక బిడ్డ ఉన్నా, ఆ సంసారము నామరూపాలు లేకుండా నేలమట్టమై పోతున్నది. ఇటువంటి సంసారాలు అనేకముగా ఉన్నాయి. రోగిష్టి సంతానానికి తగిన వైద్యము చేయించుకోవటమూ, మిగతా పిల్లలకు విద్య చెప్పించటమూ అన్న సమస్యలతో కుటుంబాలు కొట్టుకొనిపోతున్నాయి.

బిడ్డలను భావిపౌరులనుగా చేయటానికి విద్యయే సాధనమనుకొన్నప్పుడు, దానిని వ్యాప్తము చేయటములో సాధ్యమైనన్ని విధానాలను యోచించి, వాటిలో ఉత్తమమైనవాటిని అమలుపరచక తప్పదు.

విద్యకూ విధానానికీ అవినాభావ సంబంధము ఉన్నట్లే, విద్యావిధానానికీ విద్యార్థి ఆర్థిక శారీరక మానసిక పరిస్థితులకూ విడదీయరాని సంబంధము ఉన్నది. విద్యార్థి పరిస్థితుల ననుసరించి విద్యావిధానాలు మారటము అభ్యుదయ లక్షణము.

ఇంగ్లండులో 18 సంవత్సరాలవరకూ నిర్బంధోచిత విద్య ఉన్నది. అమెరికాలో ఉన్నత పాఠశాలలవరకూ ఉచిత నిర్బంధ విద్య ఉన్నది. అక్కడి పాఠశాలలూ, విద్యావిధానమూ, విద్యార్థికి సంబంధించినంతవరకూ అతడి ఆర్థిక శారీరక మానసికాభివృద్ధికి బాధ్యత వహిస్తున్నాయి. ఆ పాఠశాలల విద్య దైహికముగా, మానసికముగా, భావాత్మకముగా బిడ్డలను ఉత్తమపథమున నడిపించుకొనిపోయేదిగా రూపొందించబడ్డది.

'ప్రతి విద్యార్థీ ఆరోగ్యగాము ఉన్నాడా?' అని గమనించటము ఉపాధ్యాయుడు ప్రధాన కర్తవ్యముగా భావిస్తాడు. 'బిడ్డ వయస్సుకు తగిన పెరుగుదల ఉన్నదా? ఎత్తు, తూకము సరియైన ప్రమాణములో ఉన్నాయా?' అని ఎప్పటికప్పుడు పరీక్షించుతూ ఉంటాడు. వయస్సుకు తగిన ఆహారము బిడ్డ తింటున్నాడా-లేదా-అని కూడా గమనిస్తూ ఉంటాడు. వయస్సుకు తగిన ఆహారము తినలేకపోవటము అనారోగ్యమువల్ల అయినట్లయితే, వైద్యుల సలహాల ననుసరించి దానిని చక్కబెట్టి చేయవలసిన బాధ్యత పాఠశాలాధికారులపైన ఉన్నది. ఆరోగ్యము సరిగా ఉండి, ధనాభావము వల్ల పుష్టికరమైన ఆహారము లభించని పరిస్థితులలో, పాఠశాలాధికారులు ఉచితముగా భోజన వసతులను కల్పిస్తారు. ఆ విధముగానే విద్యార్థి వస్త్రధారణ ఉచితముగా భోజన వసతులను కల్పిస్తారు. ఆ విధముగానే విద్యార్థి వస్త్రధారణ ఉచితరీతిగా శుభ్రముగా ఉన్నదా లేదా-అని గమనించవలసిన బాధ్యతకూడా వారిదే. విద్యార్థికి తగిన ఆర్థిక స్తోమతి లేనప్పుడు, పాఠశాలాధికారులే వస్త్రధారణకు తగిన వసతులను కల్పించాలి. ఈ విధముగా విద్యావిధానములో ఆరోగ్యము ప్రధానాంగముగా పరిగణింపబడ్డది. ఈ ఆరోగ్యాన్ని దైహికము, మానసికము, భావాత్మకమైనదిగా పేర్కొన్నారు.

దైహికారోగ్యము సక్రమముగా ఉన్న బిడ్డ దేహసౌభాగ్యాన్ని కలిగిఉండటమే కాకుండా, నవచైతన్యముతో మెలగగలుగుతాడు. వయస్సుకు తగిన ప్రమాణములలో బిడ్డ పెరుగుదల ఉంటుంది. వయస్సుకు తగిన దేహపరిశ్రమ కలిగినందువల్ల శరీరము బలిష్ఠమై అలపు ఎరుగనిదవుతుంది. వేళకు విశ్రాంతి, నిద్ర బిడ్డకు అవసరమవుతాయి. క్రొత్త పరిస్థితులనూ, క్రొత్త వాతావరణాన్నీ బిడ్డ ఆత్మతృప్తితో సులభముగా అలవరచుకొంటాడు. సహృదయముతో ఆమోదించి అంగీకరిస్తాడు. ఈ విధముగానే మానసికారోగ్యముకూడా, బిడ్డ వయస్సుకు తగిన ప్రమాణములో, దైనికావసరాలకు తగినట్లుగా ఉండటము, తన చుట్టుపట్ల ఉన్న వాటిని గురించిన విజ్ఞానము కలిగించుకోవలెనన్న కుతూహలము కలిగిఉండటము ప్రధానమైనవిగా భావించబడ్డవి. నిర్దేశింపబడిన విషయముపై తగినధ్యానమూ, దానినిగురించి హెచ్చుతగ్గులు లేకుండా, స్వయముగా తిరిగి చెప్పగల నేర్పూ విద్యార్థులకు ఉండాలి. వయస్సుకు తగిన విధముగా, నిజపరిస్థితులను ఎదుర్కొనగల మనోదార్ఢ్యమూ, కార్యసాధనకు తగిన ఆత్మవిశ్వాసమూ విద్యార్థులకు ఉండవలసిన లక్షణాలు.

పై రెండింటివలెనే భావాత్మకమైన ఆరోగ్యానికి (*Emotional Health*) కూడా కొన్ని ప్రత్యేక లక్షణాలు ఉన్నాయి. సమయానుకూలమయిన భావోదయము విద్యార్థి హృదయములో కలగాలి. కరుణాత్మకమయిన పరిస్థితిలో హృదయము ద్రవించాలి. దయ పుట్టాలి. కష్టములలో ఉన్నవారియెడ సానుభూతి కలగాలి. లభించిన దానితో తృప్తి చెందాలి. కార్యము సాధించవలసి వచ్చినప్పుడు ధైర్యమూ సాహసమూ, చూపకలగాలి. కోరినవి లభించగానే సంతోషమూ ఉత్సాహమూ పొందాలి. కాని వీటికి మారుగా కోపము, కాఠిన్యము, భయము, పిరికితనము, జంకు, సిగ్గు, నిర్లిప్తత మొదలైనవి కలగటము భావాత్మకమైన

ఆరోగ్య లక్షణాల దృష్ట్యా అనారోగ్యకరమైనవి.

కళలలో క్రీడలలో నైపుణ్యము, ఆత్మాభివ్యంజనము, భావవ్యక్తీకరణము, అభిరుచుల వ్యక్తీకరణ, తోడివారితో స్త్రీ పురుషులతో పరస్పర స్నేహసహకార భావములతో మెలగుతూ ఆనందించ గలుగుట మొదలైనవి విద్యార్థులు అభ్యసించవలసిన గుణాలు.

ప్రతి విద్యార్థీ ఆరోగ్య విజ్ఞానాన్ని గురించి పఠించటమే కాదు - నడతలో చూపించటము విద్యుక్త ధర్మము. విదేశ చరిత్రలను శాస్త్రీయ విజ్ఞానాన్ని గురించి పఠించి, పరీక్షలలో వ్రాసి, మార్కులను తెచ్చుకొంటే-కృతకృత్యులు కావటములో సందేహము లేదు. కాని ఆరోగ్య విజ్ఞానమును మాత్రము సక్రమముగా ఆచరణలో పెట్టినవారే కృతకృత్యులు కాగలుగుతారు. ఆరోగ్య సంబంధమైన విషయాలన్నీ అభ్యాసములో పెట్టుకోవటానికి, వాటిని నిలుపుకోవటానికి విద్యార్థులకు శిక్షణ అవసరము. తరగతులవారీగా అలవాట్లను బోధించి, ఉపాధ్యాయులు పట్టీలను ముగించటముతో వారి బాధ్యత ముగియదు. ఆచరణలో పెట్టే విధానాలనుగురించి చెప్పాలిగాని నిషేధాలను పేర్కొనరాదు.

18 సంవత్సరాలవరకూ నిర్బంధోచిత విద్యను అమలు పరచటములో ఆ దేశాలు ఎదుర్కొనవలసిన ప్రత్యేక సమస్యలు దైహికముగా మానసికముగా అందరితో కలసి ముందుకు పోలేని విద్యార్థుల విషయములో కలుగుతాయి. మూకబధిరాంధులకు ప్రత్యేక పాఠశాలలూ, ప్రత్యేకముగా బ్రెయిల్ లిపిలో శిక్షణ పొందిన ఉపాధ్యాయులూ ఏర్పాటు కావాలి. దీర్ఘరోగులకు వైద్యాలయాలలో పాఠశాలలను (*Hospital Schools*) స్థాపించాలి. ఈ విధముగానే మానసికముగా వెనుకబడిన విద్యార్థులు కొందరు ఉంటారు. వారిని ఇతర విద్యార్థులతో కలిపి విద్యాబోధ చేసినట్లయితే, వారికి గ్రహణశక్తి చాలదు; నష్టపడతారు. కనుక ఈ జాతికి చెందిన విద్యార్థులను ప్రత్యేకముగా అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులతో విద్యాబోధ చేయించవలసి ఉంటుంది. కాని విద్యావిధానము మాత్రము ఒకటే.

స్త్రీ పురుషులకు రాజకీయోద్యోగాలను గురించి శిక్షణ నివ్వటములో అనుభవము సంపాదించిన చార్టర్సుగారు విద్యార్థుల వైయక్తికమైన శక్తిని ఈ క్రింది ఇరవై అంశాలు నిర్ణయిస్తాయనే అభిప్రాయానికి వచ్చారు. ఉత్తమాశయాలను కలిగిఉండటము, శ్రమపాటు, పట్టుదల, ఓర్పు, నమ్మిక, చైతన్యవంతమైన నిండు మనస్సు, సంభాషణలో స్పష్టత, ఆత్మవిశ్వాసము, స్నేహభావము, సర్దుబాటు, ఉపాయము, ఉల్లాసము, తీర్పరితనము, సునిశితమైన విమర్శనాజ్ఞానము, పెద్దలను అనుగమించుశక్తి, జ్ఞాపకశక్తి, శౌచము, ఆరోగ్యకరమైన అభ్యాసాలు, వివేచనాశక్తి, మితవ్యయము, ప్రాతినిధ్యము వహించు శక్తి. వీటినిబట్టి అర్హతానర్హతలను నిర్ణయింపవచ్చునని ఆయన విశ్వాసము. బిడ్డలకు విద్యగరపటములోని పరమార్థము వారి భావిజీవితాలను ప్రకాశవంతము చేయవలెననేకదా! ఈ గుణాలను ప్రతివిద్యార్థికీ కలిగించటములో విద్యావిధానమూ ఉపాధ్యాయులూ పాశ్చాత్య దేశాలలో కృషి చేస్తున్నారు.

మన దేశములో పాఠశాలలను, విద్యావిధానాన్నీ ఈ దృష్టితో సంస్కరించుకోవలసిన అవసరము మనకు అడుగడుగునకూ కనబడుతున్నది. సంఘములో మనకు ఏరంగములోనూ నిజాయితీ కోరినన్ని పాళ్లలో కనబడదు. చదువులో ఎంత విద్య ఉన్నదో చక్కెరలో ఎంతతీపి ఉన్నదో-సత్యములో ఎంత నిజము ఉన్నదో తెలిసికోవటానికి దూరదర్శినీయంత్రము అవసరమవుతున్నది. దీని కంతకూ ఆరోగ్యకరమైన భావనము లేకపోవటమే. దీనికి పునాదులు వేయవలసినవారు పాఠశాలలలో ఉపాధ్యాయులూ, ఇండ్లలో తలిదండ్రులూను. ఇందుకు తగిన వసతులను కల్పించి దోహదమివ్వవలసినవారు విద్యాశాఖాధికారులు. ఈక్రమములో ఎవరి బాధ్యతలను వారు సక్రమముగా నిర్వహించినట్లయితే ప్రతి పౌరుని శక్తిసామర్థ్యాలూ ఇనుమడించి సద్వినియోగమవుతాయి. అందుకే కాబోలు 'ఆరోగ్యమే మహాభాగ్యము' అన్నారు పెద్దలు!



వనితాలోకం :

# కలిసిరాని కన్నీరు

మందరపు పద్మ, లలిత

ఆమె నెవ్వరూ అందగత్తెగా పరిగణించరు. చంపకు చారడేసేకళ్లూ, కోన దేలినగడ్డం, కోటేరేసిన ముక్కూ, ముత్యాల్లాంటి పలువరుసా, నవ్వినప్పుడు సొట్టలు పడే బుగ్గలు ఆమెలో అమరినంత అందంగా అందగత్తె లనిపించుకునేవారిలో కూడా అమరివుండవు. అయితేఏం? ఆమెది నల్లని ఛాయ. మిసమిసలాడే పసిమిఛాయ ఆమెకు కరువయింది. అందుకే ఆమె నెవరూ రూపసిగా లెక్కించరు. పై పెచ్చు కురూపి అనడానికికూడా వెనుదీయరు.

ఆమె అందంగా అలంకరించుకుని అద్దం ముందు నిలబడింది ఒక్క నిట్టూర్పు విడిచి కుర్చీలో కూలబడి ఏవేవో ఆలోచనల్లో మునిగిపోయింది -

తనను పెళ్ళిచూపులు చూడటానికి వస్తున్నారు! తన కిదేమీ మొదటిసారి కాదూ, క్రొత్త కాదు! తనకీ 'చూపులు' అలవాటే! ఎంతమందో వస్తూండడం, పోతూండడం మామూలే!

ఎన్నో సంబంధాలు వస్తున్నాయి, పోతున్నాయి. తను ప్రతిసారీ వాళ్ళయెదుగు తల వంచుకుని కూర్చోవటం, వాళ్లు తనని నఖశిఖపర్యంతం పరీక్ష చేసిపోవటం - పోవటమే కాని మళ్ళీ వెనక్కు తిరిగి చూసిన వాళ్లేలేరు. మధ్యవర్తులద్వారానో, మాటల ద్వారానో 'అమ్మాయి నచ్చలేదం'టూ అసలు విషయం' తేల్చి పారేసేసరికి తన మనస్సు ఎంత చిన్నబోయేది! తనకూ 'అభిమానం' అంటూ ఒకటి వుంది. తన అందచందాలన్నీ నలుగురిముందూ ప్రదర్శించి వాళ్ళపరీక్షకి నిలబడటం అభిమానంవున్న ఆడదాని కెంత తలవంపు! కాని... ... ప్రతి ఆడదానికీ ఈ తలవంపులు తప్పవు! అభిమానమనేది ఆడదానికి వుండటమే తప్పేమో! అందులోనూ తన బ్రతుకు మరీ అధ్వాన్నం. తను రూపసీ కాదు, తన తండ్రి ధనవంతుడూ కాడు. ఈ రెంటిలో ఏదివున్నా తన అభిమానం యిన్నిసార్లు దెబ్బతినకపోను!

ఒకసారి తనను చూడటానికి వరుడు, వరుడి తల్లిదండ్రులు, మరికొంతమందిని వెంటేసుకొచ్చారు. తనను చూసుకోవటమైన తర్వాత తను తన గదిలోకి వచ్చి కూర్చుంది.

ప్రక్కింటి శారదమ్మ పెళ్ళికొడుకు తల్లి నడిగింది "అమ్మాయి నచ్చిందా? మీకు?" అని.

దాని కావిడ "ఆ! నచ్చడాని కేముంది? కోడలు నలుపైతే గోత్రమంతా నలుపౌతుందంటారు. ఇంతకూ మా అబ్బాయికి తెల్లటమ్మాయి నే చేసుకోవాలనుంది. ఎంత అందగత్తెను చూపించినా, 'నాకు నచ్చలేదు' పొమ్మంటాడు ఇంతకీ వాడి కెక్కడ రాసి పెట్టివుందో" అంటూ కుండ బ్రద్దలు కొట్టినట్లు చెప్పేసి అవతలికి చకచకా నడిచింది మిగతా వారితో.

తన హృదయం గాయపడింది. ఏదో తప్పు చేసినదానిలా అందరి ముఖాలు చూడటానికే జంకిపోయింది. ఏం చేసిందని తనకీ శిక్ష?

ఇంకోసారి ఎవరో చూడటానికొచ్చారు. పెళ్ళికొడుకు తండ్రి "అమ్మాయికి సంగీతం వచ్చా?" అనడిగాడు.

"ఏం, సంగీతంలెండి! మే మేమీ చెప్పించలేదు ఏదో చిన్నప్పుడు బడిలో చెప్పిన సంగీతమే" అని తండ్రి చెప్పేసరికి ఆయన పెదాలు చప్పరించాడు.

కాస్సేపయాక "పోనీ, హిందీ యేమైనా వచ్చా' అని ప్రశ్నించాడు.

నాన్న "లేద"ని తలూపాడు. ఇలానే ఆయన ప్రతీదీ "వచ్చా? రాదా?" అనడగడం, నాన్న "లేద"ని తలూపడం. "ఇదైనా చెప్పించక పోయారూ? అదైనా నేర్పించకపోయారూ?" అంటూ ఆయన యక్షప్రశ్నలు వేసేసరికి నాన్నకు వళ్లు మండి "ఏదో స్కూల్ ఫైనల్ వరకు చదువు తప్పితే అమ్మాయి కింకేమీ చెప్పించలేదు. చేసుకున్నా, మానినా, ఆపైన మీయిష్టం" అన్నాడు

మధ్యవర్తితో అత నిలా చెప్పాడట "లక్షణంగా వున్న పిల్లలు ఇట్టే చెల్లిపోతారు కాని, యిలాంటి వాళ్ళకు నాలుగు విద్యలూ నేర్పించ నక్కరలేదటండీ? అందం లేకపోయినా ఏవో యిన్ని విద్యలన్నా వచ్చునని ఎవరైనా మోజుపడి చేసుకుంటారు. అంతే గాని — ఆ పిల్లకు ఏ దడిగితే అదే రాదంటాడాయన. పెళ్ళికాక వుండిపోతారా ఏమిటి లెండి? కట్నం ఐదు వేలు యిస్తారేమో కనుక్కోండి. నలుపైతేనేం! మూతి వంకరా? ముక్కు వంకరా? కట్నం విషయంలో కానీయైనా తగనని మాత్రం చెప్పండి. ఒప్పుకుంటారా సరేసరి! ఒప్పుకోరూ - మరీ మంచిది. ఈమాత్రం కట్నంతో అందమైన అమ్మాయే లక్షణంగా వస్తుంది."

మధ్యవర్తి చెప్పిన సమాచారం విని నాన్న గుండెలు బాదుకున్నాడు. "నీకో నమస్కారం, నీ సంబంధానికో నమస్కారం బాబూ?" అంటూ ఆ సంబంధానికి అప్పుడే స్వస్తి వాచకం పలికేడు. అంతకుముందు రెండువేలల్లో వున్నవాళ్లు తనని చూడగానే రేటు ఐదువేలవరకూ పెంచారు. తన మనస్సు అభిమానంతో కుతకుతలాడిపోయింది! ఆ వేదనతో కుమిలిపోయింది తను! నల్లగావుండటమేనా తను చేసిన దోషం! ఆడపిల్లలను కన్నవాళ్లకీ కట్నాలిచ్చుకోకతప్పదు. అందులోనూ తను కాస్త నల్లగా వున్నందుకు తగిన పరిహారం చెల్లించుకోవాల్సిందే!

ఇలానే మరికొంతమంది అడిగినకట్నాలు నాన్నకు అందుబాటులో లేక, వచ్చినవాళ్లు వచ్చినట్టే తిరిగి వెళ్ళటం జరిగింది. తను అభిమానాన్ని చంపుకుని ఎన్నిసార్లు అవమానాలను సహిస్తున్నా ఫలితం శూన్యం! తల్లికి, తండ్రికి, తన పెళ్ళి ఒక సమస్యగా తయారయింది. ఎంత పాడుబ్రతుకు తనది!

తన మనస్సులో నిత్యమూ ఏదో అంపవుకోత! తను ఎన్నాళ్ళిలా అవమానాలు భరిస్తూ కూర్చోవటం!! తనకీ పెళ్లిలేకపోతేనేం? అమాటే నాన్నతో మెల్లిగా చెప్పింది. "ఎందుకొచ్చిన తాపత్రయం నాన్నా ఇదంతా ఏదో స్కూల్ ఫైనల్ వరకూ చెప్పించావు. ఆ కాస్త ట్రెయినింగ్ కూడా చెప్పించావా, నా బ్రతుకు తెరువు నేను చూసుకోలేకపోను!"

నాన్న నవ్వాడు "పిచ్చిపిల్లా! ఎంత చదివినా, ఏం చేసినా ఆడదానికి పెళ్లి ముఖ్యం. ఆ పెళ్లే కాకపోతే ఇటు నీకూ, అటు నాకు కూడా తలవంపులు తప్పవు. ఇంతకీ క—

ఘుకీయ దగ్గరపడాలి. ఈలోపున మనమెన్ని ప్రయత్నాలు చేసినా ఒకటే" అని నిట్టూర్చాడు. పైకి గంభీరంగా వున్నా నాన్న మనస్సులో ఎంత తుఫాను చెలరేగుతున్నదో తను స్పష్టంగా చూడగలిగింది. తనేం చేయగలదు?...కన్నీళ్లు విడవడం తప్ప.

ఆడవాళ్ళ మనస్సును ఆడవాళ్ళే గాయపరచాలని చూస్తారు. చిత్రం! ఎదురింటావిడ అమ్మతో అంది ఎంతో గర్వంగా "ఏమిటమ్మా! ఇన్నాళ్ళబటి చూస్తున్నాను మీ అమ్మాయికి సంబంధమేకుదరదేం? మీ అమ్మాయికంటె రెండేళ్ళు చిన్నది మా పిల్ల చూశావా వదినా! దాన్ని ఎవరు చూస్తే వాళ్ళే 'మేం చేసుకుంటాం, మేం చేసుకుంటాం!' అంటూ ఒకటే ఎగబడిపోవటం! వాళ్ళకు నచ్చితేమాత్రం మనకు నచ్చాలా అక్కర్లేదా చెప్పు! మొన్న వచ్చింది చూశావ్! ఆ సంబంధం అన్నివిధాలా బాగున్నట్టుంది! శ్రావణమాసంలో ముహూర్తాలు పెట్టుకుందామని చూస్తున్నాం."

తన హృదయం బ్రద్దలైంది తను బాగుండదని ఆమె వెక్కిరిస్తున్నది తనకు చావైనా రాకూడదూ! తన మనస్సు పూర్తిగా వికలమైపోయింది. అమ్మదగ్గరకు వెళ్ళి వెక్కి వెక్కి ఏడ్చింది.

"నాకీ పెళ్ళివద్దూ, ఏమీ వద్దూ నన్నింట్లోనే వుండనియ్యమ్మా" అంది వెక్కుతూ.

"పిచ్చితల్లీ! ఆడవాళ్లం మనం ఎన్ని అవమానాలైనా భరించాలి!" అని తల్లి తన తల నిమిరింది.

ఆడదై పుట్టడమే దురదృష్టం. అందులో నల్లగా పుట్టడం మరీను!...

అమ్మ నిజాన్ని ఎంత స్పష్టంగా చెప్పింది! ఆడదానికి పుట్టినదగ్గరనుండీ అవమానాలే!

ఆడపిల్ల పుట్టిందనగానే అందరి ముఖాల్లోనూ కళలు తప్పిపోతాయి. ఏదో పిడుగుపడ్డటు గదంతా నిశ్శబ్దమైపోతుంది. ఎవరి నోటా మాటే వుండదు. కాస్సేపటికి తెప్పరిల్లి "ఏదో పిల్లలే తల్లీ పిల్లా క్షేమంగా వున్నారంతే చాలు' అంటూ తమ కలవరపాటు కప్పిపుచ్చుకుంటారు. అక్కడినుంచి ప్రతివిషయంలోను "ఆడదేగా" అన్న చులకనతో పెళ్లాడువరకూ పెంచుకొస్తారు. వ్యక్తురాలైనదగ్గరనుంచి లోకమంతా ఆ పిల్లపై ఒక కన్నేసివుంచుతారు. వీధిలోకి వెళితే తప్పు వీధికేసి తొంగిచూస్తే తప్పు. ఆడదంటే అంత అవిశ్వాసం, అంత చులకన!

ఆ తర్వాత పెళ్లిచూపులు! అభిమానాన్ని, ఆత్మగౌరవాన్ని చంపుకుని అందరి పరీక్షకూ నిలవాలి; ప్రతి ఆడదీ ఈ పరీక్షలో నెగ్గితీరాలి. లేకపోతే పరువు మర్యాదలు మంటలో కలిసిపోతాయి. వాళ్ళకు నచ్చకపోతే, యింకొకళ్ళదగ్గర తలవంచుకుని కూర్చోవాలి. నచ్చితే సరేసరి! మెళ్లో అతనిచేత ఓ తాళి కట్టించేసుకుని, అతని వెంట పడాలి. ఇక అక్కడినుంచి అతను కొట్టితే పడాలి. తిట్టితే పడాలి ఇన్నీ అనుభవిస్తూ అతని కన్ని సదుపాయాలూ చేసిపెట్టి ఏడాదికో పిల్లని కనాలి. ఆడదానిది ఎంత నికృష్ట జీవితం!

అతని ఆయుస్సు గట్టిదైతే పసుపూ కుంకుమ కేలోటూ వుండదు. లేదా - కడుపు తరుక్కుపోయే శోకంలో మునిగే ఆ విధవను లోకం 'నీకు అవమానం చేయాలి. రారమ్మంటూ కఠినంగా ఆజ్ఞాపిస్తుంది, ఏ జాలీ లేకుండా ఆ ఆజ్ఞను దాటలేక తలవంచుకుని ఆ అవమానం భరిస్తుంది. పెద్ద తతంగం చేసి నుగుట కుంకుమ చెరిపి, గాజులు పగులగొట్టి, మంగళసూత్రాలు తీయించి - రామ, రామ! ఎంత పరాభవం! ఆడదానికి అడుగడుగునా అవమానాలు తప్పవ్!

ఆమె గజగజ వణికింది. ఆమెకు తెలియకుండానే ఆమెకళ్ళు నీళ్లతో నిండిపోయాయి.

ఈరోజు సంబంధమైనా నిశ్చయమైతే ఎంత బాగుండును అతనెంతో అభ్యుదయ భావాలు కలవాడట. కట్నంకానీ అక్కర లేదట!

తనలో సహనం యింకిపోతోంది. తను ఇంక ఈ అవమానాలు సహించలేదు. "ఏంచేస్తున్నావే, వాళ్లు నీకోసం చూస్తున్నారు. పద, పద" అంటూ తల్లి వచ్చేసరికి ఆమె త్రుళ్ళిపడ్డది. ఆలోచనల్లోంచి తెప్పరిల్లి తల్లికి తెలియకుండా కన్నీళ్లు తుడుచుకుంది. ఆమెలో తొణికిసలాడుతున్న ముగ్ధసౌందర్యాన్ని చూసి "నా కన్నతల్లిని అందగత్తెకాదని ఎవరనగలరు?" అనుకుంది తల్లి దిగ్భ్రమతో ఆమె మెల్లిగా లేచి తల్లిని అనుసరించింది, భారంగా అడుగులు వేస్తూ.

క్రింద పరిచివున్న తివాసీమీద చతికిలబడింది కాని ఆమెలో ఎక్కడా చైతన్యం లేదు.

తనకిది అంతిమపరీక్ష! దీంతో తనజీవితం అటో, యిటో తేలిపోవాలి - అదే ఆమె ఆలోచిస్తున్నది.

చటుక్కున తల పైకెత్తిచూసింది అతని చూపులు సూటిగా ఆమె కళ్ళను గ్రుచ్చినాయ్. ఆమె గజగజా వణికింది ఇతనికి తను నచ్చకపోతే ... ఆమె కళ్ళలో నీళ్ళు సుళ్లు తిరుగుతున్నాయి

"ఇంక లోపలికి పదమ్మా" అనగానే ఒక్క అంగలో గది చేరుకుని మంచంమీద విరుచుకు పడిపోయిందామె. దిండులో తల దూర్చి గుండెలు పగిలేట్టు ఏడ్చిఏడ్చి ఒక నిర్ధారణచేసుకుందామె.

* * *

అతను ఆమె అందాన్ని చూడగలిగేడు. ఆమె తన జీవితంలో నవ్యశోభను సృష్టించగలదనుకున్నాడతను. ఆమె కళ్లు రెండూ పైకెత్తి చూసినప్పుడు ఆ కళ్ళలో కన్నీటి కాంతి ... ఆమె వదనం ఎంత దీనంగా వుంది!

అతను ఆలోచనలో పడ్డాడు.

తనకో ప్రాణస్నేహితుడుండేవాడు. ఇప్పటికీ వున్నాడు - అయితే యిప్పుడతను ఆత్మసాక్షాత్కారం చేసుకుంటున్న సన్యాసి.

అతను సన్యాసి కావటం చిత్రంగా జరిగింది. అతనికి పెళ్లిజరిగి ఏడాది మించదు. పెళ్లిచూపులు చూసి వచ్చింతర్వాత అతనెంత హుషారుగా వున్నాడని! "నిజంగా ఆ పిల్ల భూలోకానికి దిగివచ్చిన అప్సరసే నంటే నమ్ము. నీవే చూస్తువుగానిలే" అని తనతో చెప్పి ఎంతో పొంగిపోయాడు. పెళ్ళికి తప్పకుండా రమ్మని తన నెంతో బలవంత పెట్టాడు కాని తనకు వీలు చిక్కలేదు. కాని పెళ్లికి వెళ్లివచ్చినవాళ్ళవల్ల అతని మాటల్లో అతిశయోక్తి ఏమీ లేదని తెలిసింది.

కొన్నిరోజుల తర్వాత తను మళ్లీ స్నేహితుని కలుసుకున్నాడు. "ఏరా! నీ పెళ్ళికి రాలేకపోయాను. పోనీ, ఇప్పుడు చూపెందు నీ భార్యని!" అన్నాడు, స్నేహితునితో చనువుగా.

"ఆవిడా...ఆవిడ. పోయింది!" అంటూ బావురుమన్నాడు స్నేహితుని చూసి తను నిర్ఘాంతపోయాడు. తనకు చేతనైనట్టు అతనోదార్చాడు.

అతను కొంతసేపటికి తేరుకుని తనతో యిలా చెప్పాడు "ఆమె ఎంతో అందకత్తె. ఆమెను పెళ్ళిచేసుకోగల్గడం నా అదృష్టమనుకున్నాను. కాని అది ఆమెకు దురదృష్టహేతువవుతుందని గాని, ఆమె జీవితాన్నే బలిగొంటుందని కాని నాకు కొంచమైనా అనుమానం తట్టలేదు మా పెళ్ళి ఎంతో వైభవంగా జరిగింది మరుచటిరోజు పెళ్లికూతురు బావిలోదూకి ఆత్మహత్య చేసుకుంది -

"నా మనస్సు ఎన్నివ్రక్కలయ్యిందో మాటలతో చెప్పలేను! ఆమె ఆత్మహత్యకు కారణం తెలుసుకునేంతవరకూ నాకు నిద్ర పట్టలేదు. చివరకెల్లాగైతే నేం తెలుసుకోగల్గాను! ?ఆమెకు ఓ దూరపుబంధు వుండేది. ఆవిడకు భర్త వదిలిపోయిన ఆస్తి, ఒకకొడుకు తప్ప నా అన్నవారెవ్వరూ లేరు. ఒకే వూరిలో వుండటంమూలాన వాళ్లు ఆమె యింటికి తరుచు వస్తూపోతూ వుండేవారు. ఆమె తనకంటే పెదయిన ఆవిడ కొడుకుతో కలిసి ఆడుకునేది అప్పటి కామె తండ్రి అంత ధనవంతుడు కాడు. చిన్ననాటి స్నేహం పెద్దయ్యేసరికి ప్రేమగా మారింది. ఆ ప్రేమకు అంకురార్పణ కావిం

# ★ కలిసిరాని కన్నీరు ★

చింకికూడా ఆమె తండ్రే. ఆమె పని తనాన్ని మెచ్చి అతను అంటుండేవాడు ఆవిడతో; 'నా కూతుర్ని నీ కోడలుగా చేసుకో అమ్మా' అని ఆవిడకూడా అదే అభిప్రాయంలో వుండేది. సరిగ్గా ఏడాదిక్రితం పరిస్థితులు తారుమారయ్యాయ్! ఆవిడ ఆస్తంతా అనుకోని చిక్కుల్లో పడి హారతి కర్పూరంలా హరించిపోయింది. దాంతో ఆవిడ మనోవ్యాధితో మంచమెక్కి, కొడుకును దిక్కులేనివాణ్ని గాచేసి ఈలోకాన్ని వదిలి పెట్టింది.

"ఆమె తండ్రి హఠాత్తుగా ఆస్తిపరుడయ్యాడు. ఆశలు పెంచుకుంటూ వచ్చిన అతన్ని అవమానించి పంపాడు. 'నిలువ నీడ లేనివాడివి నీకు కట్టబెట్టి నా కూతురికన్యాయం చేయమంటావా? బంగారం వంటిపిల్లను నీకు ధారపోసి దాని బ్రతుకు నాశనం చేయమంటావా!' అనడిగాడు.

"ఆమెతల్లి కాళ్లమీదపడి ఏడ్చింది. కాని తల్లిమాత్రం ఏంచేయగలదు? ఆడది! తండ్రి సంబంధాలు చూశాడు. చివరికి నాతో ఆమె పెళ్లి ఖాయమైంది. ఆమె హృదయం పగిలింది!

"ఆమె తల్లి కాళ్ళమీద పడి ఏడ్చింది. కాని తల్లిమాత్రం ఏం చేయగలదు? ఆడది! తండ్రి సంబంధాలు చూశాడు. చివరికి నాతో ఆమె పెళ్లి జరిగిపోయింది. పెళ్లి జరిగిన మర్నాడు సమయం చూసుకుని బావిలో దూకి ఆమె ప్రాణత్యాగం చేసుకుంది.

"పెళ్లిచూపులకు వెళ్ళినప్పుడు ఆమె అందాన్ని మాత్రమే చూసి మురిసిపోయాను గాని ఆమె ముఖం కళ కాంతులు తప్పి దీనంగా వుండటం నేను గమనించనేలేకపోయాను. ఇప్పుడాలోచించుకుంటే ఆమె నాకేసి ఎంత దీనంగా చూసిందో కళ్ళకు కట్టినట్లు కన్పిస్తోంది- ఇప్పుడేమనుకుంటే ఏం లాభం! నిష్కారణంగా యిద్దరి జీవితాలను బలిగొన్నాను. "ఏం చేస్తే పోతుంది నా పాపం" అంటూ చిన్నపిల్లడిలా ఏడ్చాడు తన స్నేహితుడు.

స్నేహితుడి కథ జ్ఞాపకం వచ్చేసరికి అతనికి గుండె బరువెక్కింది. కనురెప్పలు తడిసినాయ్.

ఆమె ఎంత దీనంగా చూసింది! అందమైన ఆ కళ్ళలో కన్నీటి బిందువులు! ఆమె ప్రేమను కాదని తండ్రి వేరే సంబంధం కట్టబెట్టాలని చూస్తున్నాడు కాబోలు. ఆమె తనను ఎంతో దీనంగా యాచిస్తున్నట్టు కనిపించింది. ఏమైనా తనామె ప్రణయజీవితాని కడ్డురాకూడదు!

అతను దీర్ఘంగా ఆలోచించి "నేనీ పెళ్ళి కంగీకరించలే"నంటూ ఆమె తండ్రికి లేఖ వ్రాశాడు. ఆ వుత్తరంలోని సంగతి ఆమెమనస్సుకెంత హాయినిస్తుందో వూహించుకుని అతనెంతో తృప్తిపొందాడు. ఉత్తరం పోస్టులో వేసి అతను తేలికపడిన హృదయంతో హాయిగా నిద్రపోయాడు.

పోస్టుమేన్ ఇచ్చిన ఆ వుత్తరాన్ని ఆశతో అందుకున్నాడామె తండ్రి. కవరు చించాడు. నిరాశతో కూలబడిపోయాడు.

ఆమె తండ్రినిచూసి అంతా గ్రహించుకుంది. ఆమె గంభీరవదనంలో ఏ మార్పూ లేదు. గదిలోనికి వెళ్లి కృష్ణవిగ్రహంముందు మెల్లగా మోకరిల్లింది.

* * *

ఆమె ఆత్మహత్య చేసుకున్నదన్న వార్త విని అతను నిర్ఘాంతపోయాడు. ఆమె ప్రియుడామెను నమ్మించి మోసం చేశాడేమో! ఇంతకూ ఆమెను తను రక్షించలేకపోయాడు. పరిపరి విధాల ఆలోచించుకుని అతనెంతో బాధపడ్డాడు—

అంతేగాని ఆమె కన్నీటిబిందువుల్లోని అర్థం, ఆమె ఆత్మహత్యలోని ఆంతర్యం అతనికెలా అర్థమవుతుంది?

ఆమె కన్నీటిబిందువులు అతనికి వేరే అర్థాన్ని చెప్పాయి. ఆ అర్థమే ఆమె జీవితాన్ని బలిగొన్నది. కలిసిరాని కన్నీరు!

★




# పసితనమున...!

అలపర్తి వెంకటసుబ్బారావు

పసితనమున చేసిన
పనులు గుర్తుకొచ్చిన
నవ్వు వచ్చుచుండును
నాకు యిప్పుడిప్పుడు—

నెమలికన్ను లోనను
భ్రమతు సరివిరెమ్మను,
వెన్నపులిమి చీకటి
గొన్నిదినము లుంచితి—

గజ్జెలోను అనియెడి
గాఢ నమ్మకంబుతో,
తొండ నొకటి చంపితి
కుండలోన దాచితి—

'సినం' నా చేతికి
చిక్కు ననెడి ఊహతో,
ఖరీదైన సోడా
కాయ పగులగొట్టితి—

'కానీ చెట్టు' మొలచు
ననే ఆశతోడను,
కానీ యొకటి భూమి
లోన పాతిపెట్టితి—




# పులి, తోడేలు

చీకటి రాతిరి తోడేలు
మేకల మందను జొచ్చినది.
అందొక దానిని పట్టుకొని
తొందరగా పరుగెత్తినది.

కానన మందున జనుచుండ
దానిని బెబ్బులి చూచినది.
భయమున వణకుచు తోడేలు
రయమున మేకను వదలినది.

వ్యాఘ్రము మేకను తీసుకొని
శీఘ్రముగా పోబోయినది.
వృకమా బెబ్బులి వెంటబడి
వినయముగానే పలికినది:

"మీకిది తగునా పులిరాజ!
మేకను శ్రమపడి తెచ్చితిని.
ఇతరుల సొత్తును ఈరీతి
ఎత్తుకు పోవుట అక్రమము."

వికవిక నవ్వుచు పెద్దపులి
వృకమును గని ఇటు లాడినది:
'న్యాయా న్యాయము లెంచుటకు
న్యాయార్జితమా ఈ మేక?

ఇతరుల దోపిడి చేయకను
బ్రతికెడి దెట్టులు మనబోంట్లు?
నీతుల నెందుకు పలికెదవు
నీవూ నేనూ దొంగలమె!

ఇదివిని సిగ్గున తోడేలు
బదులాడక వెనుదిరిగినది.
శార్దూలము ఆ మేషమును
నిర్దయగా కబళించినది.

ఈసప్ కథలు 19 — నండూరి రామమోహనరావు



## నీతి

రాజ్యమ్ములు ఆయుధబల
భోజ్యములై యుండెడి ఈ
దరణీ తలమందు నేడు
దొరలెవ్వరు, దొంగలెవరు?

బాలసాహితి సీరియల్

# మార్టిన్ రాట్లర్

మూలం: ఆర్. ఎమ్. బాలన్‌టైన్

## 1

మార్టిన్ రాట్లర్ వట్టి ఆకతాయి కుర్రాడు. ఈ విషయమై అతని పెద్దమ్మ మిసెస్ డరోతీ గ్రంబిట్‌కు నిశ్చితమైన అభిప్రాయా లున్నాయి. ఆమె అభిప్రాయాలను మనం కాదనడానికి వీల్లేదు. ఎందుకంటే, మార్టిన్ ఆమెవద్దనే పెరిగాడు. అందుచేత అతన్నిగూర్చి ఆమెకు తెలిసినంతగా మరొకరికి తెలియడానికి వీలులేదు. "నన్ను దుఃఖపెట్టడానికే వీడు పుట్టాడు. కోతివెధవ, కొరకరాని కొయ్య," అని ఆమె నిత్యమూ సాధిస్తూనేఉండేది. ఆమె చెప్పే కథలు వింటూంటే నిజంగానే మార్టిన్‌రాట్లర్ గుండ గొయ్య పిల్లాడనిపించేవాడు.

మిసెస్‌గ్రంబిట్ అభిప్రాయంతో గ్రామం లోనివాళ్ళలో పలువురు ఏకీభవించేవారు. అయినా మార్టిన్ ఎక్కడన్నా కనిపిస్తే "ఏమోయ్, బాగున్నావా? ఏమన్నా చదువుకుంటున్నావా?" అని కుశలప్రశ్నలు వెయ్యకుండా వదిలిపెట్టేవాళ్లు ఎవరూ లేరనే చెప్పవచ్చును. మార్టిన్ ఎంత 'గడుగ్గాయి' అయినా ఎవరూ అతన్ని ద్వేషించేవారు కారు. అతడు చెడ్డవాడని ఎవరన్నా అంటే, ఆమాట నమ్మనట్లుగా నవ్వి ఊరుకునేవారు. ఆ ఊళ్లో చర్చి అధికారి ఒకాయన ఉండేవాడు. వృద్ధుడు; తల పండిపోయింది; చాలా మంచివాడు. ఆయన మార్టిన్‌ని తుంటరివాడనేవాడు. అయినా పెద్దయితే తుంటరితనం పోతుందని చెప్పేవాడు. ఆయన చెప్పినది తోసెయ్యడానికి వీలులేదు. ఆయనకి అయిదుగురు కొడుకులు. వారు కాక, దూరపుబంధువు ఒకని కొడుకులు మరి ముగ్గురు ఆయన ఇంట్లోనే పెరుగుతున్నారు. అదిగాక ఊళ్లో వాళ్ళ పిల్లలందర్నీ తన పిల్లల్లాగానే చూసుకునేవాడు. ఆయనకి పిల్లలంటే మంచిసరదా. కాని ఊళ్లో డాక్టరొకాయన ఉన్నాడు. ఆయన స్వభావం ఇందుకు పూర్తిగా వ్యతిరేకం. పిల్లలంటే, అందులో మరీ చిన్నపిల్లలంటే, ఎందుకో చెప్పరాని ద్వేషం. మార్టిన్ వట్టి రౌడీ అని ఆయన ఉద్దేశ్యం.

కాని మార్టిన్ ముఖం చూస్తే రౌడీ అని ఎవ్వరూ అనుకోరు. బూరెల్లాంటి ఎర్రని బుగ్గలు, దొండపండులాంటి ఎర్రని, గుండ్రని మూతి, తీర్చి దిద్దినట్లున్న ముక్కు, చిబుకము, పెద్దనుదురు, నుదురు కనిపించకుండా రింగులు తిరిగి ముఖంమీద వాలే జుట్టు—ఇంత మంచిలక్షణాలుకల బాలుణ్ణి రౌడీ అని ఎవరనుకుంటారు? నిద్రపోతున్నప్పుడు అతని ముఖం చూస్తే ఎంత అమాయకంగా కనిపిస్తుందని? కాని కళ్లు తెరిచి చూశాడా, పెదిమల చివర, కళ్లచుట్టూ అల్లరి ఆలోచనల రేఖలు ఒక వెయ్యి కనిపించి మాయమైపోతూ ఉంటాయి. దేన్నిగూర్చి అయినా తీవ్రంగా ఆలోచిస్తున్నప్పుడుమాత్రం మార్టిన్ పెద్ద వేదాంతిలాగ మొహం పెడతాడు.

అనువాదం: నండూరి రామమోహనరావు

పెద్దమ్మ డరోతీ గ్రంబిట్ ముక్కు కొంచెం పైకి తిరిగిఉంటుంది చివర. అంటే ముక్కుపుటాలలోకి సూర్యరశ్మి సైతం సూటిగా ప్రవేశించడానికి వీలుగా ఉంటుందన్నమాట. ఆమె కళ్లజోడు పెట్టుకుంటే, అది క్రమంగా జారి జారి, ముక్కుచివరదాకా వస్తుంది. ఎన్నిసార్లు సరిచేసుకున్నా సరే కళ్ళజోడు ఆ అడ్డు గోడదగ్గిర తప్ప ఇంకెక్కడా నిలవదు.

మిసెస్ గ్రంబిట్ నెమ్మదస్తురాలు; ఎండిన వరుగులాగ ఉంటుంది. ఆమె వయస్సు 75 ఉండ వచ్చును. కాని అంచనా వెయ్యడం కష్టమే. ఆమెకు కూడా తన వయస్సు ఇంత అని కచ్చితంగా తెలియదు. పాతకాలపు ఎత్తైన టోపీ పెట్టుకునేది. తాటికాయలంత పువ్వులున్న ముతకగుడ్డతో కుట్టిన గౌను తొడుక్కునేది. ఆ గౌనుగుడ్డ చూస్తే ఆమె బీదరాలని వేరే చెప్పనక్కర్లేకుండానే తెలిసిపోతుంది. ఆమె వయస్సు అంచనా వెయ్యడం ఎంత కష్టమో, ఆమె పేదరికం అంచనా వెయ్యడం కూడా అంత కష్టమే. ఆమె పాపం నిత్యమూ ఇబ్బందుల్లోనే ఉండేది. మార్టిన్‌కు బడికి పంపే వయస్సు రావడం ఆమెకు మరింత ప్రాణాంతకమైంది. చేతిలో చిల్లిగవ్వ లేదు. అతన్ని బడికి ఎలా పంపడం? కాని అతనిమీదఉన్న ఆపేక్షకొద్దీ ఎలాగో ఓలాగ బడికి పంపాలని ఆమె నిశ్చయించింది. జర్మనీలో ఆమె ఎప్పుడో ఆరేళ్ళపాటు ఉన్నప్పుడు మేజోళ్లు అల్లడం నేర్చుకుంది. అంత వేగంగా మరెవరూ అల్లలేరు. ముందు రెండు డజన్ల మేజోళ్లు అల్లింది. చర్చిఅధికారి ఒక డజను, డాక్టరు మరొక డజను కొనుక్కున్నారు. ఈ సంగతి అందరికీ తెలిసింది. ఆ ఊళ్లో ఆట్టే షాపులు లేవు. ఉన్న షాపుల్లోకూడా చెత్తరకంసరుకు ఉండేది. ఈ కారణంచేత మేజోళ్లు కావాలని ఊళ్లో పెద్దపెద్ద వాళ్లందరు ఆమెనే అడిగారు. మిసెస్ గ్రంబిట్ అల్లకం సూదులు చకచక తిరిగిపోసాగినాయి. కొద్ది రోజుల్లో మేజోళ్లు తయారయినాయి. మార్టిన్ రాట్లర్‌ను బళ్లో ప్రవేశపెట్టారు.

మిసెస్ గ్రంబిట్ అల్లకం పనిచేస్తున్నప్పుడు కిటికీదగ్గిర కుర్చీవేసుకుని కూర్చుంటుంది. కిటికీలోంచి చూస్తే తోటలు, వాటిమధ్య నాట్యంచేస్తూ పారే ఏరు, పచ్చని పొలాలు, గొర్రెలు, పశువులు, దూరంగా నీలపు సముద్రమూ మొదలైన అందమైన దృశ్యాలన్నీ కనబడతాయి. కాని మిసెస్ గ్రంబిట్ ఎప్పుడూ వాటిని కన్నెత్తి చూసేదేకాదు. వాటిమీద ఇష్టంలేక కాదు. చూసినా ఆమెకు దూరపు చూపు ఆనదు. తాను కూర్చున్న గదిలో సగంమేర తప్పించి ఆపైన కనిపించదు. కళ్ళజోడు పెట్టుకుంటుంది గనుక, గదిలో ఒక మూల కణకణలాడే నెగడు, గోడకి వ్రేలించిన ఆమె భర్త చిత్రపటము, నెగడు ఎదురుగా తివాచీమీద కూర్చునే పిల్లిమాత్రం కనిపిస్తాయి. ఆమెభర్త బతికి ఉన్నప్పుడు నౌకలో కెప్టెన్ ఉద్యోగం చేసేవాడు. ఆయన చిత్రపటంలో ఇప్పుడు కోటు స్థానంలో నీలపు మరక, వేస్టుకోటు బదులు తెల్లని మరక, తలకాయ బదులు పసుపుపచ్చనిమచ్చమాత్రం మిగిలాయి. మిగతా వివరాలన్నీ మాసిపోయాయి. అయినా అస్పష్టంగా కనబడే ఆ బొమ్మను చూసుకునే ఆమె సంతృప్తిపడేది.

## 2

మార్టిన్ బళ్ళోకి వెళ్లడం మొదలెట్టాక అనతి కాలంలోనే అతనికి ఒక చిన్న పరాభవం జరిగింది.

“ఒరే మార్టిన్! పోయి ఆ నెగడులో కొంచెం బొగ్గులు వేసి విసురు. సరిగ్గా మండడంలేదల్లే వుంది. జాగ్రత్తగా విసురు, నిప్పురవ్వలు ఎగురుతాయి,” అని ఒకరోజున మేష్టారు మార్టిన్‌రాట్లర్‌ను ఆజ్ఞాపించాడు.

అప్పుడు క్లాసంతా బెంచీలమీద నిలబడిఉంది. అందుచేత నిలబడడం కాసేపైనా తప్పుతుందిగదా అని మార్టిన్ రాట్లర్ ఉత్సాహంగా బయలుదేరాడు. నిప్పు ఎగదోసి, జాగ్రత్తగా, నెమ్మదిగా ఒక్కొక్క బొగ్గుముక్క మంటలో వేసి, ఇంకా జాగ్రత్తగా విసిరాడు. ఏదోవిధంగా అక్కడ కాలయాపన చెయ్యాలని అతని ఆలోచన. మళ్ళీ నిప్పు ఎగదోసి, సరిగ్గా మండుతోందో లేదో పరీక్షించాడు. కాని మండడం లేదనుకున్నాడో ఏమో, మళ్ళీ బొగ్గులు కదపడం సాగించాడు. ఇదంతా చూస్తున్న బాబ్ క్రోకర్ అనే పెద్ద కుర్రాడు అసూయపట్టలేక మేష్టారితో చెప్పాడు, మార్టిన్ నెగడుదగ్గిర ఆటలాడుతున్నాడని.

“మార్టిన్, నీ చోటులోకి వచ్చి నుంచో” అని మేష్టారు తీవ్రంగా అన్నారు.

మార్టిన్ తిరిగివచ్చి నుంచున్నాడు. అతని చూపుడువేలికి కొద్దిగా మసి అంటుకుంది. దాన్ని చూసి అతనికి ఏదో అల్లరి ఆలోచన పుట్టింది.

మేష్టారు ఇంకో బాలుణ్ణి గదమాయిస్తూ ఉండడం చూసి, ఎవరికీ తెలియకుండా ఆ వేలితో పక్కనున్న అబ్బాయి నుదుటిమీద, ముక్కుమీద మెల్లిగా తాకించాడు.

ఇంతలో మేష్టారు ఒక బాలుణ్ణి ఏదో ప్రశ్న అడిగాడు. వాడు చెప్పలేకపోతే, పక్కవాణ్ణి, వాడి పక్కవాణ్ణి, అలా వరసగా అడుగుతూ, మార్టిన్ పక్కనున్న బాలుణ్ణి చూశాడు.

"అరె. జాన్ వార్డ్! ఏమిట్రా అది?" అని గర్జించారు మేష్టారు.

"ఏమిటి సార్?" అని జాన్‌వార్డ్ వణుకుతూ అడిగాడు. క్లాసంతటా ఆపుకుంటున్న నవ్వువినవచ్చింది.

"నీ మొహంమీద ఆ మసి ఏమిట్రా?"

"న—న—నాకు— తె—తె—తెలవదండి" అంటూ జాన్ వార్డ్ చొక్కాతో మొహం తుడుచుకున్నాడు. మసి చొక్కాకంటింది.

ఒక్కసారి వరద వచ్చినట్లు క్లాసుక్లాసంతా నవ్వులతో మోగిపోయింది. మరుక్షణంలో గుండు సూది పడేస్తే ధన్‌మని చప్పుడయ్యేటంత నిశ్శబ్దం ఆవరించింది.

"మార్టిన్ రాట్లర్! నువ్వేకదూ, వాడి మొహాన మసి అంటించింది. అదేం నీ వేళ్ళమీద మసి! ఇట్రా నువ్వు. నువ్వేనా ఆ వెధవపని చేసింది," అని అరిచారు మేష్టారు.

మార్టిన్ రాట్లర్ ఎప్పుడూ అబద్ధాలు చెప్పిఎరగడు. అబద్ధాలు చెప్పడం పాపమనీ, అబద్ధాలకోర్లను దేవుడు క్షమించడనీ, మనిషి అసహ్యించుకుంటాడనీ అతని పెద్దమ్మ అతనికి చిన్ననాటినుండీ నూరిపోసింది. అందుచేత మార్టిన్ ఎంత శిక్ష అయినా అనుభవిస్తాడు గాని, బుద్ధిపూర్వకంగా అబద్ధాలు మాత్రం చెప్పడు. మేష్టారి కళ్ళల్లోకి సూటిగా చూస్తూ "అవును, నేనేనండి," అన్నాడు మార్టిన్.

"సరే. నువ్వు ఈ సాయంత్రం ఆటలకి పోవడానికి వీల్లేదు. క్లాసులోనే నిలబడి ఉండు," అని ఆజ్ఞాపించారు మేష్టారు.

తరవాత క్లాసు వదిలిపెట్టారు. పిల్లలందరూ వెళ్ళిపోయారు. బాబ్ క్రోకర్ ఆఖర్న వెళ్ళిపోతూ మార్టిన్‌దగ్గిరికొచ్చి "రాట్లర్! నీ పెంపుడుపిల్లికి ఈత నేర్పుదామనుకుంటున్నాను. నువ్వు కూడా వచ్చి చూస్తావా?" అన్నాడు మెల్లిగా.

బాబ్ క్రోకర్ నవ్వే కుచ్చితపు నవ్వు చూస్తే అతడు అన్నంతపనీ చేస్తాడనిపించింది. తన పిల్లిని కాపాడుకోడానికి పరిగెత్తిపోవాలనిపించింది. కాని మేష్టారు ఇంకా కుర్చీలోనే కూర్చుని తీవ్రంగా చూస్తున్నారు. ఆయన్ని చూసేసరికి మార్టిన్ కుంగిపోయాడు. కిటికీఅవతల పచ్చికలో ఆడుకునే విద్యార్థులను చూస్తూ తన పరాభవం మరిచిపోవడానికి ప్రయత్నించాడు.

## 3

"మార్టిన్!" అని మేష్టారు గద్దించారు. "అలా కిటికీలోంచి అవతలికిచూడగూడదు. ఇటువేపుతిరుగు."

"సార్, సార్, చూడనివ్వండి సార్" అని భయంతోనే ప్రాధేయపడ్డాడు మార్టిన్.

"చూట్టానికి వీల్లేదు," అని తీవ్రంగా గద్దిస్తూ, చేతుల్లోని బెత్తాన్ని బల్లమీద చరిచారు మేష్టారు.

"సార్! నన్ను బయటికి పోనివ్వండి. బాబ్ క్రోకర్ నా పెంపుడు పిల్లిని ఎత్తుకుపోతున్నాడు. దాన్ని నీళ్లలో ముంచి చంపేస్తానని ఇందాక అన్నాడు. అది చచ్చిపోతే, మా పెద్దమ్మ చచ్చిపోతుంది. మా పెద్దమ్మకు ఆ పిల్లి అంటే పంచప్రాణాలూను. దాన్ని నేను కాపాడుకోవాలి. వదిలిపెట్టండి సార్. నన్ను వదలిపెట్టకపోతే మీరు హంతకులవుతారు" అన్నాడు మార్టిన్ రాట్లర్. వెంటనే బల్లమీంచి గభాలున దుమికి గుప్పిళ్ళు బిగించి, జేవురించిన ముఖంతో మేష్టారిముందు నిలబడ్డాడు. అతని చర్యకు మేష్టారు నిర్ఘాంతపోయారు. ఒక నిమిషం ఇద్దరూ ఒకరొన్కరు అలానే చూసుకున్నారు. మార్టిన్ ఉద్రిక్త ముఖం చూసేసరికి మేష్టారికి కోపంపోయి చిరునవ్వు వచ్చింది. "సరే, పో" అన్నారు.

ఆ మాట అనీ అనగానే మార్టిన్ మెరుపులాగ క్లాసులోంచి దూసుకుపోయి, స్కూలు దాటి, ఆటస్థలంలో ప్రవేశించాడు. ఆటస్థలానికిచుట్టూ ఇనప కడ్డీల కంచె ఉన్నది. కంచె ఏమంత ఎత్తుగా లేకపోయినా, దూకడం కష్టమే. స్కూల్లో ఏ బాలుడూ, దానిమీద చేతులానించకుండా ఎప్పుడూ దూకలేదు. కాని మార్టిన్ తన పిల్లిని రక్షించుకోవాలనే ఉద్రే

ంలో దూకేశాడు. గుర్రంలాగా పరిగెత్తి, లేడిలాగా ఎగిరి, గుమ్మడికాయలాగా అవతల పడి, బంతిలాగా దొర్లుకుంటూపోయాడు. మోకాలిచిప్పలు రెండూ పగలగొట్టుకుని, మళ్ళీ ఎప్పుడు లేచాడో, ఎప్పుడు మళ్ళీ పరిగెత్తాడో పరిగెత్తాడు. రెండు నిమిషాల్లో బాబ్ క్రోకర్‌ను సమీపించాడు. మార్టిన్ తన వెనకాలే రావడం చూసిన బాబ్ పరుగు లంకించుకున్నాడు. అతనితోపాటు స్కూలుపిల్లలందరూ కూడా పరిగెత్తారు. అందరూ చివరికి వాగుదగ్గరికొచ్చారు. బాబ్ క్రోకర్ ఆగి, పిల్లిని మెడమీద తోలుతో పట్టుకుని ఊగిస్తున్నాడు.

"అరే, బాబ్! వద్దు వద్దు. దాన్ని చంపద్దు. నీళ్ళలో పడెయ్యద్దు. చచ్చిపోతుంది," అని పరిగెత్తుకొస్తూన్న మార్టిన్ కేకవేశాడు.

"వన్, టూ, త్రీ" అని వికటాట్టహాసం చేస్తూ బాబ్ క్రోకర్ పిల్లిని విసిరేశాడు. ధన్‌మని నీళ్ళలో పడి మునిగింది పిల్లి.

మంచులాగా ఉన్న చల్లని నీళ్ళలో మునిగి పిల్లి కొయ్యబారిపోయింది. కాని ఆ తెల్లపిల్లి సామాన్యమైన పిల్లి కాదు మళ్ళీ పైకి వచ్చి, ధైర్యంగా ఒడ్డుకు ఈదుకొనివచ్చింది. నీళ్ళలో పడడానికి ముందు, గుండ్రంగా, లావుగా, మెత్తని బొచ్చుతో ముచ్చటగా ఉన్న పిల్లి, పైకి వచ్చినతరవాత, ముద్దైపోయి, వణికిపోతూ, గుర్తుపట్టడానికి వీల్లేకుండా ఉంది. ఈలోగా

మార్టిన్ వాగుదగ్గిరికి వచ్చాడు. అతనికంటే బాబ్ క్రోకరే ముందు పట్టుకుని దాన్ని మళ్ళీ విసరడానికి గిరగిర తిప్పుతున్నాడు. విద్యార్థులందరూ "వద్దు వద్దు" అని గోలచేస్తున్నారు. అయినా బాబ్ క్రోకర్ వినిపించుకోలేదు. ఇంతలో మార్టిన్ రాట్లర్ ఎగిరి దూకి బాబ్ చొక్కా-కాలర్ పట్టుకుని గుంజ కిందపడేశాడు. పిల్లి చరాలున తప్పించుకుని పొదల్లోకి పారిపోయి దాక్కుంది.

బాబ్ క్రోకర్ యీడు ముదిరిన బాలుడు. మార్టిన్‌కంటె బాగా పెద్దగా కనిపిస్తాడు. బలిష్ఠంగా ఉన్నాడు. అందుచేత మార్టిన్ పట్టు విడిపించుకుని, అతన్ని పడేసి రొమ్ముమీద ఎక్కి ముఖంమీద కొట్టడానికి చెయ్యి ఎత్తాడు. కాని విద్యార్థులందరూ వచ్చి అడ్డుపడి ఇద్దరినీ విడదీశారు.

"కిందపడిపోయినవాణ్ణి కొట్టడం తప్పు" అని అంతా ఏకగ్రీవంగా అన్నారు.

"అయితే రమ్మనండి వాణ్ణి. వెధవని చితకగొట్టేస్తాను, వచ్చుడికింద," అన్నాడు బాబ్.

మార్టిన్ కోపంతో బాబ్‌మీదికి ఎగబడబోయాడు. విద్యార్థులు అతన్ని ఆపుచేసి, బాబ్‌తో "నీ యీడువాళ్ళతో నువ్వు దెబ్బలాడాలికాని, చిన్నవాళ్లతో కుస్తీపట్టడం ఏం న్యాయం" అన్నారు.

"సరే. మీలో ఎవరొస్తారో రండి. నేను రెడీగా ఉన్నాను. కలేజా ఉంటే రండి," అన్నాడు బాబ్ అందర్నీ ఉరిమిచూస్తూ.

కాని అతనితో సవాలుచెయ్యడానికి ఎవరూ ముందుకు రాలేదు. బాబ్ క్రోకర్ బడిలో అందరిలోకీ పెద్దవాడు, బలమైనవాడు. కాని నిజానికి అతనంత పిరికివాడు ఇంకోడు లేడు.

ఎవరూ ముందుకు రాకపోవడం, మార్టిన్‌ను అందరూ పట్టుకుని ఆపుచేయడం చూసి బాబ్ క్రోకర్ పొదల్లో దాక్కున్న పిల్లిని పట్టుకోడానికి ముందడుగువేశాడు. మార్టిన్‌ను చూసి "ఏయ్, నీ పిల్లిని ఈసారి వాగుమధ్యకి విసిరేస్తా చూడు. లేకపోతే నాతో దెబ్బలాటకు తయారవుతావా?" అన్నాడు.

"వద్దు బాబ్! నీతో దెబ్బలాట నాకిష్టంలేదు. నువ్వేం చెయ్యమంటే అది చేస్తాను, నా పిల్లిని వదిలిపెట్టు. నేను దెబ్బలాడితేగాని వదిలిపెట్ట నంటావా, దెబ్బలాడతాను. దెబ్బలాడకముందే నా పిల్లిని చంపావా, నీకంటె పిరికివాడు ప్రపంచంలో లేడన్నమాట. నాకు ఒక్క అయిదు నిమిషాలు టైమియ్యి. కాసిని మంచినీళ్లు తాగనియ్యి. తరవాత నా వంట్లో సత్తువ ఉన్నంతసేపు దెబ్బలాడతాను," అన్నాడు మార్టిన్.

బాబ్ ఆశ్చర్యంగా చూశాడు తన శత్రువును, ఎంత ధైర్యం వీడికని. "సరే. అలాగే ఒప్పుకుంటాను. నువ్వు ఓడిపోతే, నీ పిల్లిని వాగులో ముంచితీరుతాను. తెలుసా?" అన్నాడు. నెమ్మదిగా తన కోటు, మెడ చుట్టూ కట్టుకున్న రుమాల, విప్పేశాడు. చేతులు పైకి మడిచాడు. మార్టిన్ కూడా అలాగే చేశాడు. ఒకడు పోయి టోపీలో నీళ్లుపట్టి తీసుకొచ్చి ఇచ్చాడు.

సేదదీరిన తరవాత మార్టిన్ రాట్లర్ లేచి పిడికిళ్లు బిగించి నుంచున్నాడు. బాబ్ క్రోకర్ అంతకు ముందే రెడీగా ఉన్నాడు. ఇద్దరూ పిడికిళ్లు ముందుకు చాచుతూ ఒకరిచుట్టూ ఒకరు వస్తాదులలాగా గుండ్రంగా తిరగసాగారు. తతిమా విద్యార్థులు వారికి చోటిచ్చి చుట్టూరా నిలబడ్డారు.

(ఇంకా ఉంది)

జపాన్‌కథ : ఎస్. కటో

# వీరాగ్రేసరుడు రెయికో

## 1

పురాతన జపాన్‌రాజ్య ముఖ్య పట్టణమైన క్యోటోలో మినామోటో-నో-రెయికో అనే వీరాగ్రేసరు డొకడుండేవాడు. అతను మహాబలవంతుడు. ధైర్యస్థైర్యములు కలవాడు. అతనిపేరు వినని పిన్న పెద్దలు లేరు. పిల్లలు ముఖ్యంగా మగపిల్లలు అతని వీరోచిత కృత్యాలను కథలుగా, గాథలుగా చెప్పుకొని వినోదిస్తుంటారు.

ఆరోజుల్లో క్యోటో నగరాన్ని పటన్‌డోజి అనే పిశాచం తన దుష్కృత్యాలతో భీభత్సం చేసివేశాడు. ఆ పిశాచం క్యోటో నగరానికి సమీపంలోవున్న ఓయే పర్వతంపై నివసిస్తున్నాడు. అది ఒక్కొక్కసారి మానవరూపాన్ని ధరించి పర్వతగుహను విడిచివచ్చి క్యోటో నగరవీథుల్లో సంచారం చేసి పసిపిల్లలను ఎత్తుకుపోయి ఆ కొండగుహలో గల తన దివ్య సౌధంలో దాచేవాడు. అక్కడ వాళ్ళచేత పనులు చేయించేవాడు. ఆకలైనపుడు కబళించేవాడు. అయితే తమ బిడ్డలు ఎలా తప్పుకుపోతున్నారో నగరవాసులకు అంతుపట్టలేదు చాలాకాలంవరకు. కాని ఓయే పర్వతసమాచారం దేశం నలుమూలలా విపరీతంగా ప్రచారం అయింది. ఆ భయంకరవార్త ప్రజలను భయకంపితులను చేసింది.

చివరకు ఈవార్త చక్రవర్తికి చేరింది. ఇటువంటి దుష్టశక్తులను నిర్జించాలని చక్రవర్తి కృతనిశ్చయుడైనాడు. మంత్రివర్గసమావేశం అత్యవసరంగా జరిపి చర్చించారు. రెయికోతప్ప చక్రవర్తి కొలువులో ఏ ఒక్కడూ ఇందుకు సమర్థుడు కాడని మంత్రులందరూ ఏకగ్రీవంగా అంగీకరించారు. చక్రవర్తి రెయికోను పిలిపించారు. ఓయే పర్వతంపైకి దాడి జరిపి ఆ పిశాచాన్ని హతమార్చి రావలసిందిగా ఆజ్ఞాపించారు.

**క్రై. రామచంద్రరావు**

రెయికో ఆనందంతో అందుకు ఆమోదించాడు. వెంటనే ఒక కార్యక్రమాన్ని నిర్ణయించుకున్నాడు. తన ప్రత్యర్థి మానవుడు కాడు కనుక, భయంకరమైన, కుత్సితుడైన రాక్షసి కనుక నేరుగా వెళ్ళి ఎదుర్కొనడం క్షేమంకాదని భావించాడు. తన సహచరులలోని కొద్దిమంది వీరులను వెంటతీసికొని మారువేషంలో వెళ్ళడానికి నిశ్చయించాడు. గుహలోని రాక్షస భవనంలోకి వెళ్ళగలిగితే చాలు, విజయంపొందవచ్చునని అతని దృఢ విశ్వాసం. తన సహచరులలోని ఐదుగురు ధైర్య, బలశక్తివంతులను పిలిచి సంగతంతా వివరించి చెప్పాడు. వాళ్ళంతా ఆమోదించారు. ఇది చాలా ప్రమాదకరమైన, భయంకరమైన దండయాత్ర కనుక భగవంతుని ఆశీర్వాదం పొందకుండా వెళ్ళడం సమంజసంకాదని భావించి క్యోటోలోని మూడు ప్రసిద్ధ దేవాలయాలకు వెళ్ళి ప్రార్థనలు చేశారు.

తర్వాత వాళ్లు పర్వతప్రాంత మతాచార్యుల వేషంతో దేశమంతా తీర్థయాత్ర సేవించేవారిలా బయలుదేరారు. తమ ఆయుధాలను వీపులకు తగిలించుకున్న పెద్దసంచులలో భద్రపరచి యాత్రికుల దండమును కుడిచేతితోను, జపమాలను ఎడమచేతితోను పట్టుకొని నడక సాగించారు. ఏఒకరుకూడా వాళ్లను చూసి ఓయే పర్వతంపైకి దాడి వెడలే వీరాధివీరులని గుర్తించలేకపోయారు.

రెయికో, అతని అనుచరులు ఓయేపర్వతంచేరేసరికి ముగ్గురు వృద్ధులు ఎదురైనారు. ఏమీ తెలియని అమాయకులవలె కనబడుతున్న ఆ ముగ్గురూ రాక్షసులుకాక మరెవరూ అయివుండరని రెయికో భావించాడు. అతడు ప్రతినిమిషం జాగరూకతతో ఎప్పుడు ఏ ప్రమాదం సంభవిస్తుందోనని సంసిద్ధుడై వుంటున్నాడు.

"మమ్మల్ని చూసిభయపడకండి. మేము క్యోటోనుంచి వచ్చాం. తప్పిపోయిన మా బిడ్డలు కనబడతారేమోనని ఆశతో వెదుకుతున్నాం.



పడగెత్తిన ఫణిరాజు

ఫొటో : ఆమంచి మధుసూధనరావు—రాజోలు.

## ★ వీరాగ్రేసరుడు రెయికో ★

చక్రవర్తిఆజ్ఞప్రకారం మీరు వస్తున్నారని దారిలో విని మిమ్మల్ని కలిసికుంటాంకదానని ఎంతో ఆనందంతోవున్నాం. తమ ప్రియపుత్రికలను పోగొట్టుకున్న అసంఖ్యాక అభాగ్యులలో మే మొకళ్ళమని గుర్తించండి. మీరు ఆ రాక్షసిని ఎదుర్కొని దయదలచకుండా శిక్షించండి. మా బిడ్డలు బ్రతికివుంటే రక్షించండి" అని చిరునవ్వులు ఒలకపోస్తూ చెప్పారు.

వారి మాటలలోని నిజాయితీని రెయికో విశ్వసించాడు.

"మీ బిడ్డలకు హానిజరగకుండా చూస్తాను" అని అభయ మిచ్చాడు.

ఆ వృద్ధులు పరమానందసంభరితులై ఒక జాడీతో సారాయమును ఇచ్చి "కృతజ్ఞతాచిహ్నంగా ఈ విచిత్రసారాయమును మీకు ఇస్తున్నాము. దీనిని రాక్షసులు సేవిస్తే వారి కుండుకొనిన శక్తిని కోల్పోతారు. మీరు త్రాగితే మీ శక్తి పదింతలు పెరుగుతుంది. మీరు ఆ రాక్షసిని ఎదుర్కొనేముందు వారి చేత త్రాగింపించండి. మీ పని సులువు అవుతుంది" అని చెప్పారు.

రెయికో ఆ జాడీని పుచ్చుకున్న దే తడవుగా ఒక పెద్దకాంతి, దివ్యతేజస్సు ఆ వృద్ధులను ఆవరించింది. వారు అంతట అంతర్ధానమైపోయారు. తాము అంతకు ముందు దర్శించిన దేవుళ్ళుతప్ప ఇతరులు కారని రెయికో, అతని అనుచరులు నిశ్చయంగా తెలుసుకున్నారు. "ఏం అద్భుతం! ఆ త్రిమూర్తులు మనలకు ప్రత్యేక రక్షణకల్పిస్తున్నారు. ఈ సారాయం మనకు ప్రసాదించారు. అంటే మనకు విజయంతథ్యమన్నమాట!" అన్నాడు రెయికో.

తర్వాత కృతజ్ఞతాసూచనగా

అందమైన తోట. తోటనడుమ గులాబిచెట్టు. గులాబిచెట్టుకు గులాబిపువ్వు.

ఆ చెట్టుమీదే ఒక పిట్ట. రంగు రంగుల అందమైన పిట్ట.

పొద్దున లేచిన దగ్గిర్నించీ పువ్వూ, పిట్టా కలిసి పాట పాడడం మొదలెడతాయి.

ఒకటి పువ్వుల భాషలో, ఒకటి పిట్టల భాషలో పాట పాడతాయి.

"చిట్టిపిట్టను చిట్టిపిట్టను
చిన్నారి పిట్టను......
రంగు రంగుల చిట్టిపిట్టను
రత్నాల పిట్టను......"

అని పిట్ట పాడుతుంది.

"గులాబినోయ్ గులాబినోయ్
గుబాళించే గులాబినోయ్
ముద్దులొలికే గులాబినోయ్
ముళ్ళైనా గులాబినోయ్"

అని పువ్వు పాడుతుంది.

కొంతసేపు ఆగుతాయి రెండూ.

మళ్ళీ పిట్ట అందుకుంటుంది :

"రంగు రంగుల చిట్టి పిట్టను
రత్నాల పిట్టను..."

పాట పూర్తి చేస్తుంది పువ్వు :

ముద్దులొలికే గులాబినోయ్
ముళ్ళైనా గులాబినోయ్"

మళ్ళీ పిట్ట అందుకుని పాడుతుంది :

"చిట్టి చిట్టి చిట్టి చిన్నారి పిట్టను,
రంగురంగురంగు రత్నాల పిట్టను."

పువ్వు సమాధానమిస్తుంది :

"ఘుమా, ఘుమా, ఘుమా,
గులాబినోయ్!
గుబాళించే గులాబినోయ్!"

ఈ విధంగా చీకటిపోయింది మొదలు, చీకటి పడేదాకా రెండూ పాడతాయి. గొంతుకలు బాగానే ఉంటాయి గనక వింటానికి బాగానే ఉంటుంది. ఆకారాలు బాగానే ఉంటాయి గనక చూట్టానికి బాగానే ఉంటాయి.

అయినా, 'ఒప్పుకున్నాం బాబూ, మీరు బాగానే ఉంటారు' అని చెప్పినా వినకుండా అవి అస్తమానం పాడుతుంటే, చిరాకుపుట్టి, ఏదో వంకమీద తప్పించుకుపోవా లనిపిస్తుంది.

ప్రణామంచేసి ఆనందంతోను, అచంచలవిశ్వాసంతోను వాళ్ళు ప్రయాణించారు. ఒక కొండవాగు అడ్డు వచ్చింది. అక్కడొక అందమైనస్త్రీ దుఃఖభారంతో బట్టలు ఉతుకుతూ వుంది. రెయికో హృదయం ద్రవించిపోయింది. రాకుమార్తెలావున్న ఆమెకు ఎంతటి విపత్తు దాపురించింది! ఆమెదగ్గరకువెళ్ళి ఈ పిశాచ ప్రాంతానికి ఎలా వచ్చావని అడిగాడు. తానొక బందీననీ, ఆ ఉతికే వస్త్రం అప్పుడే పటక్ డోజీచే అరగించబడిన ఒక అభాగ్యుడిదనీ ఆమె చెప్పింది. రెయికో తను వచ్చిన విషయం చెప్పగానే ఆమె "అయితే నువ్వు నిజంగా రెయికోవేనా? నీ గురించి తరుచుగా చాలా విన్నాను. నువ్వు వచ్చినందుకు కృతజ్ఞులం! నేను నిను గుహలోనికి ప్రవేశం వచ్చేలా చూస్తాను. దారి చూపిస్తాను. రాక్షసి మూకను చంపు. మమ్మల్ని రక్షించు" అంది. ఆమె ముఖవర్చస్సు నిజంగానే రాకుమార్తెను తలపింపచేస్తున్నది.

ఉక్కుతో నిర్మించబడిన ఆ పిశాచ భవనాన్ని చేరారు. ఒక పెద్ద ఇనపద్వారం—దానిముందు ఎర్రని, నల్లని భూతాలు రెండు కాపలా కాస్తున్నాయి. చూడ్డానికే అవి చాలా భయంకరంగా వున్నాయి. రాకుమారి ఆ కాపలా దారులవద్దకు వెళ్ళి "వీరు బాటసారులు. ఈ పర్వతప్రాంతంలో దారి తప్పి ఇలా వచ్చారట. ఈ రాత్రికి ఇక్కడ బసచేస్తారట. అనుమతి పొందండి" అని చెప్పింది.

వాళ్ళు వికృతంగా నవ్వి పటక్ డోజీకి చెప్పడానికి లోనికి వెళ్ళారు. పటక్ డోజీ ఆ రాత్రికి బలే మంచి ఉపాహారం చిక్కిందని సంతోషించి వెంటనే ప్రవేశపెట్టమన్నాడు.

లోనికి ప్రవేశం దొనువెంటనే లభ్యమైనందుకు రెయికో, అతని అనుచరులు ఎంతో ఆనందించారు. ఇక విజయం తథ్యమని నిశ్చయించారు. రాకుమార్తె దారి చూపుతుండగా వాళ్ళు ఎన్నో పెద్ద పెద్ద గదులను నడవలను దాటి దాటి

# ★ వీరాగ్రేసరుడు రెయికో ★

చివరకు లోపలి కోటభాగాన్ని చేరారు. అక్కడ ఒక ఉన్నతమైన, గౌరవప్రదమైన సింహాసనంపై పిశాచనాయకుడు పటన్‌డోజీ ఆశీనుడై వున్నాడు.

అటువంటి భయంకరాకృతిని ఆ వీరాధివీరులు కలలోకూడాచూసి వుండలేదు. పదిఅడుగులఎత్తు, ఎర్రని చర్మం, చీపురుపుల్లల్లా వెంట్రుకలు - ఇంతటిభయంకరదృశ్యాన్ని మరెవరైనాచూసివుంటే స్మృతితప్పి పడిపోతారు.

తమ ప్రత్యర్థికి ఏమాత్రం అనుమానం కలగకూడదని రెయికో, అతని అనుచరులు సగౌరవంగా వంగి కృతజ్ఞతను వెల్లడించుకున్నారు.

పటన్‌డోజీ తీవ్రంగా ఒకసారి వాళ్ళను పరికించిచూసి, పిడుగుల ధ్వనితో "మీ రెవరో మాకు తెలియదు. కాని మీకు వసతిని కల్పించడం మాకు ఆనందమైంది. మీరు సుఖంగా విశ్రాంతి తీసికోండి" అన్నాడు.

తాను తన సహచరులు ఉత్తర జపాన్‌లోని మాంటు హోగరోకు చెందిన్న మతాచార్యులమనీ, రాజధానీనగరానికి వెడుతూ మార్గమధ్యంలో దారితప్పిపోయామనీ రెయికో చెప్తూ "తమ అనుజ్ఞ లేనిదే తమదేంగుండా వచ్చినందుకు క్షమించండి. అంతేకాదు తమకు ఇస్తున్న శ్రమకు క్షంతవ్యులం" అని విధేయతగా పలికాడు.

ఈ వినయవిధేయతలకు పటన్‌డోజీ అపరిమితానందంతో రాత్రికి చంపబడతారనే అభిప్రాయాన్ని కప్పిపుచ్చడానికి విందును ఏర్పాటు చెయ్యమన్నాడు. ఒక పెద్ద విలువైనతివాసీ పరచబడింది. అందంగా అలంకరించుకున్న సుందరీమణులు రకరకాల వంటకాలను వడ్డించారు. ఈ సుందరాంగులందరూ పటన్‌డోజీచే అపహరించబడ్డవారనీ, వీరినందరినీ త్వరలోనే విముక్తులను చెయ్యాలనీ రెయికో తనలో తానే తలపోశాడు.

విందు మధ్యలో రెయికో తన సంచినుంచి సారాయి జాడీని తీసి పటన్‌డోజీతో "ఇదిగో ప్రభూ! ఇది మా దేశంలో తయారైన సారాయి. ఇది ఏదో చవకరకమైనదైనా సుఖశాంతుల నిస్తుందనీ, మీలోని శక్తులను ప్రదీప్తంచేస్తుందనీ మా విశ్వాసం. దీనిని, ఈ మా దేశపు సారాయిని మీరు సేవించి మమ్మానందింపచెయ్యండి" అని విన్నవించాడు రెయికో. అంతేకాదు అది ప్రమాదరహితమైనదని ఋజువుపరచేందుకుగాను మొట్టమొదటగా అతనూ, అతని అనుచరులూ దానిని త్రాగారు.

ఆదరపూర్వకమైన ఈ కోరికకు ముగ్ధుడై పటన్‌డోజీ ఒక పెద్ద కప్పును వారిముందుకు నెట్టి "పోయండి, దీనిలో పోయండి. నేను రుచిచూస్తాను" అన్నాడు. అడిగినదే తడవుగా వారు దానిని నింపగా దానినంతనూ ఒక్కగుక్కలో త్రాగి "ఆహా! ఇంతటి రుచ్యమైన సారాయిని ఇంతవరకు మేము రుచిచూచి వుండలేదు. ఇంకా పోయండి. నిండుగాపోయండి" అని ఆ పెద్ద లోటాను తిరిగి వాళ్లముందుకు నెట్టాడు.

"తమరు మాదేశపు చవకరకపు సారాయిని సేవించి ప్రస్తుతించినందుకు మా కెంతో ఆనందంగా వుంది ప్రభూ! తమ రిదిసేవిస్తూ వుండగా మేము నృత్యంచేసి మిమ్ము అలరిస్తాము" అంటూ రెయికో అతని అనుచరులతో నృత్యం చేయనారంభించాడు.

ఆనృత్యంచూస్తూ పటన్‌డోజీ, అతని పిశాచగణం ఉల్లాసంతో ఆ సారాయి జాడీ చుట్టూ మూగి అదేపనిగా త్రాగడం మొదలుపెట్టారు. అయితే ఆ జాడీ ఎప్పటికీ ఖాళీగాకుండా వుంది. ఆ మాంత్రిక సారాయి వాళ్ళమీద గట్టిగా పనిచేసింది. నిద్రమత్తు ఆవరించింది. గాఢ సుషుప్తిలో మునిగిపోయారు. వాళ్లు ఆ నిద్రలోగుర్రుపెడుతూవుంటే ఉరుములు ఉరుముతున్నట్టుగా వుంది.

రెయికో ఒక్క అదటున లేచి "ఇంక మన పనికి వేళఅయింది. సిద్ధపడండి" అని హెచ్చరించాడు. ఆ వెనువెంటనే అందరూ తమ తమ సంచులనుంచి కత్తులను, కఠారులను తీసి ఆయుధధారులైరి.

"ఉత్సాహంగా ఉండండి. త్రిమూర్తులు మనకు సర్వదా సహాయంచేస్తారు. విజయం మనదే" అంటూ రెయికో పడిపోయి నిద్రలో వున్న పటన్‌డోజీపై కెగిరి నరాలు... కత్తితీసి కంఠాన్ని ఉత్తరించేశాడు. ఆ రాక్షసి తల ఆవెంటనే వికృత

రూపం పొందింది. రెండుకొమ్ములు, పెద్దనోరు,భయంకరమైన ముఖంతో పైకెగిరి రెయికోను పొడవడానికి, కొరవడానికి ఒక్కసారిగా క్రిందకు దిగింది. తక్షణమే రెయికో తన వాడికత్తిని ఝుళిపించి నేలను కూల్చాడు.

ఆ పడినశబ్దానికి మేల్కాంచిన ఇతరపిశాచాలు రెయికోపై విరుచుకుపడ్డాయి. రెయికో, అతని అనుచరులు ఆ మత్తులోవున్న పిశాచగణాన్ని తుత్తునియలుగా చేశారు. అంతటితో ఒక్కపిశాచం కూడా మిగలకుండా విజయం చేపట్టారు.

ఈ సంఘటనచూసిన బందీకృత రాకుమార్తెలు అత్యంతానందంతో రెయికోవద్దకు రివ్వునవచ్చి "ఓ జనరల్ రెయికో! ధన్యవాదాలు. వీరాధివీరా! జేజేలు. ప్రాణరక్షకా! కృతజ్ఞతాంజలులు. ఇక మా జననీ జనకులను దర్శిస్తాం. నిన్ను భగవంతుడు రక్షిస్తాడు! ఓ రెయికో శామా!" అంటూ ఆ వీరులను చుట్టుముట్టారు.

వారంతాకలసి రాజధానీ నగరానికి పయనమైనారు. మృతుడైన షటన్‌డోజీ శిరస్సును ఒక పెద్ద మోకుకు తాడుకుకట్టి దూలానికి వేలాడదీసి తన అనుచరులు మోసికొనిరాగా రెయికో విజయగర్వంతో ముందు నడిచాడు.

ఈ విజయవార్త దేశమంతా దావానలంలా వ్యాపించిపోయింది. క్యోటో నగరం చేరీ చేరగానే తండోపతండాలుగా ప్రజలు కూడి బారులుతీరినిలబడిస్వాగతమిచ్చారు. తమ బిడ్డలను శాశ్వతంగా కోల్పోయినట్టుగా భావించిన తలిదండ్రులు ఆనందంపట్టలేక తబ్బిబ్బై నారు. వాళ్లు ఇది స్వప్నమా! అనుకున్నారు. రెయికోను, అతని అనుచరులను అభినందన పరంపరలతో ముంచెత్తారు. ప్రశంసించారు. ప్రస్తుతించారు! విలువైన బహుమతుల నిచ్చి ఘనంగా సత్కరించి తమ కృతజ్ఞతను వెల్లడించుకున్నారు.

షటన్‌డోజీ పుర్రెను తీసికొని రెయికో రాజదర్శనం చేశాడు. చక్రవర్తికి జరిగినదంతా నివేదించాడు. పరమానందభరితుడై చక్రవర్తి రెయికోకు ఉన్నతాధికార పదవిని ఇచ్చి గౌరవించాడు. దేశం నలుమూలలా ప్రతిఇంటా పిన్నలూ పెద్దలూ రెయికో శక్తిసామర్థ్యాలనుగురించి కథలుగా, గాథలుగా చెప్పుకున్నారు.

## 2

మౌంట్ ఓయేపైకి దాడి వెడలి వచ్చిన అతికాలంలోనే క్యోటోనగరాన్ని మరొకపీడ పట్టుకుంది. కిడోమారు అనే బందిపోటుదొంగ దారులుకాసి దోచుకోవడం, గృహాలను కొల్లగొట్టడం, హత్యలు చెయ్యడం మొదలైన ఘాతుక కృత్యాలద్వారా దేశప్రజలను భీతావహులను చేశాడు.

ఒకరోజు సాయంత్రం రెయికో తన అనుచరులతో వేటకువెళ్లి తిరిగివస్తూ తనతమ్ముడు, యోధుడు అయిన యోరినోబు ఇంటిమీదుగా రావడం తటస్థించింది. ఒకరోజంతా గుర్రపుస్వారీ చెయ్యడంవల్ల అలసిపోయి ఆపూటకు తమ్మునితో కులాసాగా విందారగించి విశ్రాంతి తీసికోవాలనుకున్నాడు. తన హఠాదాగమనం తన తమ్ముని ఏర్పాట్లను భంగపరుస్తుందేమోననే ఉద్దేశంతో లోనికి కబురంపాడు. యోరినోబు తనఅన్న, అతనిసహచరులు విందుకు వస్తున్నందుకు ఆనందించాడు. అసలు ఆరోజున ఒక విందు ఏర్పాటు చేదామనే ఉద్దేశంతో వున్నాడతను.

రెయికో విందుఏర్పాట్లనుచూసి విశేషమేమిటని అడిగాడు. యోరినోబు తోటలోని ఒక చెట్టును చూపెట్టాడు. ఆ చెట్టుమానుకు

ఒక వ్యక్తి కాళ్లూ చేతులూ బంధింప బడి వున్నాడు.

"బాగానే వుంది తమ్ముడూ, ఏమిటి పూర్తిగా చెప్పు" అన్నాడు రెయికో కుతూహలంతో.

"వీడు పేరుపడ్డ గజదొంగ కిడో మారు. వీడిని నా సేవకులు పర్వత శిఖరాగ్రంపై పడుకొని వుండగా పట్టుకున్నారు. రేపు వీడిని అధికారులకు అప్పగింత పెట్టేలోగా ఈ రోజునే ఒక విందు చెయ్యడం ఉచిత మని భావించాము ఎందుకంటే ఇంతటి భయంకర బందిపోటు దొంగను పట్టుకోవడం మన కుటుంబ గౌరవాన్ని ఇనుమడింప చేస్తుంది. నువ్వు నిజంగా సరియైన వేళకు వచ్చావు అన్నా. మాకెంతో ఆనందంగా వుంది. ఈరోజున మనకు కలిగిన ఈ మహత్తర అదృష్టాన్ని, ఆనందాన్ని మనం ఉభయులం పొందుదాం" అన్నాడు విజయ గర్వంతో యోరినోబు.

రెయికో బయటకు వచ్చి బందీ వంక తీక్షణంగా చూశాడు. అతని ముఖం వికృతంగా భయంకరంగా వుంది. శరీరం విపరీతంగా పెరిగి పోయివుంది. కాళ్లూ చేతులూ చెట్ల మానుల్లా వున్నాయి. రెయికోకు అతను మానవుడులా కనబడలేదు. భూతంలా కనబడ్డాడు. మౌంట్ ఓయే వద్ద కొద్దికాలం క్రితం తను సంహరించిన షటన్‌డోజీ పోలికలు ఇతనిలో గోచరించాయి.

"భేష్‌గా వుంది యోరినోబూ! నిజంగా నువ్వు ప్రశంసాపాత్రుడవు. నీ దేశానికి నువ్వు ఘనమైన సేవ చేశావు. ఈరోజు విందు తగివుంది" అన్నాడు రెయికో తమ్ముని అభినందిస్తూ. అంతేకాదు "అటువంటి త్రాడుతో వాడిని కట్టడం ప్రమాదంకదా! ఇనపగొలుసులతో వెంటనే కట్టించు" అని హెచ్చరించాడు.

యోరినోబు తన అన్నగారి సలహాను పాటించి పెద్దపెద్ద ఇనప గొలుసులను తెప్పించి వాడిచుట్టూ కట్టించాడు.

ఆ క్షణంవరకు కిడోమారు ఆ త్రాళ్ళను త్రెంపుకొని బయటపడ

వచ్చుననుకున్నాడు. కాని యీ పెద్ద లావు యినపగొలుసులను త్రెంపడం ఎట్లా? బయటపడడం ఎట్లా? రెయికో మధ్య వచ్చి కలగ చేసుకున్నందుకు వాడికి కోపం వచ్చింది. రెయికోపై ఎలాగైనా పగతీర్చుకోవాలనుకున్నాడు. వాడి కోపాన్ని రెయికో గుర్తించక పోలేదు. అయితే నిర్లక్ష్యంగా చూస్తూ విందులో పాల్గొనడానికి వెళ్ళిపోయాడు.

ఆ రాత్రి చాలా ఆనందంగా గడిచిపోయింది.

కిడొమారు ఇంట్లోని అందరూ నిద్రపోయేవరకు నిశ్శబ్దంగా వేచి వున్నాడు. ఆతర్వాత తన శక్తి నంతా వినియోగించి ఆ యినప గొలుసులను ఫటాలున త్రెంపి వేశాడు. పెద్ద అడవి జంతువులా రొప్పుతూ, రోజుతూ కొండ ఎలుకలా ఎగ్రాకి ఇంటి కప్పునెక్కాడు. పెంకులను పెక లించి బొరియచేసి అక్కడనుంచి సరిగ్గా పడుకుని నిద్రపోతున్న రెయికో పైకురికి అతని కుత్తుకను ఉత్తరించాలని భావించాడు.

రెయికోమాత్రం తక్కువ వాడా? ఏమాత్రం అలికిడిఅయినా ఉలిక్కిపడి లేచేవాడు. అలాంటిది అంత పెద్దశబ్దం అయినతరువాత నిద్రపోతూఉంటాడా? అందులోనూ ఏసమయాన ఏప్రమాదం మూడు తుందోనని అతను జాగ్రత్తగానే వున్నాడు. ఎప్పుడైతే కిడొమారు ఇంటి పైకప్పునెక్కాడో రెయికో లేచికూర్చుని ప్రక్కగదిలోపడుకుని ఉన్న అనుచరుణ్ణి పిలిచి “ఇంటి పైకప్పుమీద ఏదో శబ్దమైంది. నా నిద్ర భంగమైంది. అది ఎలుకఅయి వుండొచ్చు. మరేదైనా అయి వుండొచ్చు. ఏమైనా మనం తక్షణం బయలుదేరాలి. మనవాళ్ళనంద రనూ లేపు. గుర్రాలను సిద్ధపెట్టండి. కురమాయామా మఠం తెల్లవార కుండా దర్శించాలి” అన్నాడు బిగ్గ రగా.

“బలే! బలే! రెయికో కురుమా యామా వెడతాడట. దారిలో వాడినీ, వాడి అనుచరులనూ హత మార్చేస్తాను” అనుకున్నాడు కిడొ మారు తనలో. ఆ వెంటనే క్రిందకుదిగి కురుమాదారి పట్టాడు. విశాలమైన మైదానంలో ఎద్లు మేస్తున్నాయి. కిడొమారు అక్కడకు వచ్చేసరికి ఒకఆలోచన తట్టింది. వెంటనే తన ముష్టితో ఒక మోదుమోది ఒక ఎద్దునుచంపి దానిచర్మం వలిచి తను దానిని కప్పుకు కూర్చున్నాడు. ఎద్దు రూపంలోవున్న మానవుడు!

అలా అతను ఎంతసేపో వేచి వుండనక్కర్లేకపోయింది. రెయికో, అతని అనుచరులు ఆ వెంటనే అక్క డకు వచ్చారు రెయికో అడవిఎద్దు లనుచూగాడనే కొంతసేపు వేటా డదామన్నాడు. వాళ్లు ఆ అవకాశం తమనాయకు డిస్తున్నందుకు చాలా ఆనందించారు. అతను చెప్పినదే తడవుగా విల్లు అమ్ములనుతీసి వేట ప్రారంభించారు. జంతువులు రివ్వున పారిపోతున్నాయికాని ఒకటి మాత్రం పొదచాటునవుంది. దానిని చూసి ఆశ్చర్యపడి రెయికో దాని చెంతకు వెళ్లాడు. కప్పుకున్న చర్మాన్ని తీసేసి కిడొమారు “ఓ రెయికో! నీపై పగబట్టాను తెలుసా? నేను కిడొమారూను” అంటూనే ఖడ్గం తిప్పుతూ రెయికో పైకి దుమికాడు. రెయికో తన గుర్రంపైనుంచే కత్తి తీసి కొద్ది సేపు ఖడ్గయుద్ధం చేసి ఆ వెనుకఒక్క వ్రేటుతో కిడొమారూ కంఠాన్ని నరికేశాడు. ఆ తల తెగిపోయినా మొండెం స్థిరంగా అలాగే నిలబడి వుంది. ఆ చేతిలోని ఖడ్గంతో బలంగా రెయికో గుర్రాన్ని కొట్టిన మీదట ఆ మొండెం నేలకూలింది.

కిడొమారు పగ అంత దొడ్డది. తల తెగిపోయినా మొండెం కొంత వరకు పోరాడింది. ఆవిధంగా యోరి నోబూచే పట్టుబడిన బందిపోటు దొంగ అతని అన్న రెయికో చేతిలో అంత మొందాడు ★







ఎమ్. సాదిక్ నిర్మించిన హాస్యచిత్రం "ముసాఫిర్ ఖానా"లో శ్యామ



టపాకాయలు కాల్చి చెల్లెలికి తమాషాలు చూపిస్తున్నాడు. రాముడు.

అన్నపూర్ణావారి "దొంగరాముడు"లో మాస్టర్ వర్మ, చి॥ విజయలక్ష్మి

## బొంబాయి [illegible]

విశ్వభారతి ఫిలిమ్స్‌వారు "బసంత్ బహార్" చిత్రనిర్మాణం ప్రారంభించారు. ఒక గాయకుని జీవితం ఆధారంగా తీయబడుతున్న ఈ చిత్రంలో భారత్ భూషణ్, నిమ్మి ప్రధానపాత్రలు ధరిస్తున్నారు. బైజూ బావ్రా, చైతన్యమహాప్రభు, మీర్జాగాలిబ్ చిత్రాలలో అద్భుతంగా నటించిన భారత్‌భూషణ్ ఇప్పుడు బొంబాయి తారలలో అగ్రశ్రేణిలో ఉన్నాడు. నిర్మాతలు పలువురు ఈయనను బుక్ చేయాలని తహతహలాడుతున్నారు. 'బసంత్ బహార్' చిత్రానికి కథ విశ్రాం బెడేకర్ వ్రాశారు. సంభాషణలు రాజేంద్రసింగ్ బేడీ వ్రాశారు. మిగతా నటీనటుల్లో లీలా చిట్నీస్, కుంకుం, చంద్రశేఖర్ మున్నగువారున్నారు.

బి. ఆర్. చోప్రా నిర్మిస్తున్న "ఏక్ హీ రాస్తా"లో మీనాకుమారి అశోక్‌కుమార్, సునీల్‌దత్‌లతో కలిసి నటిస్తున్నది. ఈ చిత్రం కథ ముఖ్రం శర్మ వ్రాశారు. మీనాకుమారి న్యూథియేటర్స్‌వారు నిర్మిస్తున్న "అమర్ బాణీ"లో కూడా నటిస్తున్నది. ఫిల్మిస్తాన్‌వారు నిర్మించబోయే మరొక పెద్ద చిత్రంలో కూడా ఆమె నటించబోతున్నది. ఆ చిత్రాన్ని ఆమెభర్త కమాల్ అమ్రోహీ డైరెక్ట్ చేస్తారు. ఈ చిత్రం కథ ఢిల్లీ మొగల్ పాదుషాలలో ఆఖరివాని కాలంలోనిదని, దాన్ని రంగుల చిత్రంగా తీస్తామని కమాల్ అమ్రోహీ తెలియజేశారు.

ఇషారా, డా॥ కోట్నీస్, తీన్‌బత్తీచార్ రస్తా, ఝనక్ ఝనక్ పాయల్ బాజే చిత్రాల రచయితయైన దివాన్‌షరార్ ఇప్పుడు స్వయంగా చిత్రాలు నిర్మించడానికి దర్ చిత్రా అనే కంపెనీ స్థాపించారు. ఈయన "నిర్వాణ" అనే చిత్రం నిర్మించనున్నారు. ఇందులో నర్తకిగా వైజయంతిమాల, అభిభట్టాచార్య సన్యాసి ఉపగుప్తుడుగా నటించుతారు. జయగోపాల్ డైరెక్టు చేస్తారు.

పి. ఎల్. సంతోషి నిర్మించే 'గర్మాగరమ్' అనే చిత్రంలో ఆగా, నాదిరా నటిస్తున్న ఒక సన్నివేశంలో సర్కస్ సింహం ఒకటి ఇటీవల పాల్గొన్నది. కొక్కురుమనకుండా కూర్చునే ఆ సింహాన్ని చూసి, నాదిరా "ఈ సింహం పది చిత్రాలు దెబ్బతిన్న తర్వాత నిర్మాత ఎలా ఉం

# ★ బొంబాయి సినిమా లేఖ ★

టాకీ అలా ఉన్నది" అని వ్యాఖ్యానించింది.

*  *  *

అగస్టులో బొంబాయిలో జరిగిన రెండు వివాహాలు మన తారలు చిత్రాలలో ఎంత వింతగా ప్రవర్తిస్తారో జీవితంలోకూడా అంత వింతగానూ ప్రవర్తిస్తారని స్పష్టం చేశాయి.

సిక్ జాతి యువతి గీతాబాలి, షమీకపూర్ అగస్టు 28 వ జుహూ బీచ్‌లో కలుసుకొని వివాహం చేసుకో నిశ్చయించారు. మర్నాడు ఉదయం నాలుగింటికల్లా మలబార్ హిల్, బనగంగా దేవాలయంలో హిందూ సంప్రదాయాల ప్రకారం వివాహం జరిగిపోయింది. వారిద్దరూ కలిసి నటించిన మొదటి చిత్రం "కాఫీ హౌస్" దర్శకుడు హెచ్. అహ్లువాలియా కన్యాదానం చేశారు. కొద్ది రోజుల తరవాత ఇరువురూ భోపాల్ వెళ్ళి పృథ్వీరాజ్ ఆశీర్వాదం పొందివచ్చారు. వీరిప్పుడు నటించే చిత్రాలు "మిస్ కోకాకోలా", "రంగీన్ రాతే". గీతాబాలి నటించిన "బరాదారీ" త్వరలో విడుదల కానున్నది. ఈ చిత్రం నిర్మాత కె. అమరనాథ్.

*  *  *

హిందీ, తమిళ చిత్రాలు చాలా వాటికి నృత్య దర్శకుడుగా పనిచేసిన కె. ఎ. షెట్టి 45 రోజులపాటు తూర్పు జర్మనీలో పర్యటించి వచ్చారు. తమ నృత్యబృందంతో తూర్పు జర్మనీలో 37 ప్రదర్శనాలు ఈయన ఇచ్చారు. ఈయన బృందంలో హిందీ, గుజరాతీ చిత్రాల తార రూపమతి ముఖ్యనర్తకి.

మరొక ప్రముఖ నృత్యదర్శకుడు అనంద్ బి. శరన్ ప్రస్తుతం యూరప్‌లో పర్యటిస్తున్నారు. యూరప్‌లో నృత్య ప్రదర్శనాలివ్వడానికి అవసరమైన ఏర్పాట్లు ఆయ చేసుకుంటున్నారు. ఈయనకు ప్రభుత్వం కూడా కొంత ధనసహాయం చేయవచ్చునని తెలుస్తోంది. ప్రదర్శనాలలో కొందరు సినిమా తారలు కూడా పాల్గొంటారు. ఆనంద్ శరన్ 1948 లో మొదటిసారిగా భారతీయ నృత్యాలను బి.బి.సి. టెలివిజన్ కార్యక్రమాలలో ప్రవేశపెట్టారు. ఆ సంవత్సరంలో కూడా ఆయన యూరప్ రాజధానులలోను, ఇంగ్లండులోనూ విజయవంతంగా ప్రదర్శనాలిచ్చారు. ఈయన ఇటీవల నృత్యదర్శకుడుగా పనిచేసిన చిత్రాలు టాక్సీ డ్రైవర్, దుల్హన్, అధికార్ మొదలైనవి.

*  *  *

సొహ్రాబ్ మోడీ నిర్మిస్తున్న "ఘర్ ఘర్ మె దివాలీ"లో శ్యామ, సజ్జన్ ప్రధాన పాత్రలు ధరిస్తున్నారు. ఈ చిత్రం దీపావళికి విడుదల కావచ్చును.

(ఆంధ్రవారపత్రిక విలేఖరి)

★



విజయభట్ నిర్మిస్తున్న "పత్రాని"చిత్రంలో స్త్రీవేషం ధరించిన హాస్యనటుడు ఓంప్రకాష్.

# సినిమా వార్తలు

శ్రీ రాజరాజేశ్వరీ ఫిలిమ్స్‌వారి 'శ్రీకృష్ణతులాభారం' చిత్రం ముప్పాతికభాగం పూర్తయిందని అక్టోబర్ మాసాంతానికి విడుదల కావచ్చునని తెలుస్తున్నది. సత్యభామగా ఎస్. వరలక్ష్మి, కృష్ణుడుగా రఘురామయ్య, నారదుడుగా సూరిబాబు నటిస్తున్నారు. శ్రీరంజని, రేలంగికూడా ఈ చిత్రంలో నటిస్తున్నారు. శ్రీనివాసరావుగారు దర్శకత్వం వహిస్తున్నారు. సంభాషణలు రావూరి సత్యనారాయణగారు వ్రాశారు. పాటల రచయిత దైతా గోపాలం గారు.

రాజరాజేశ్వరీవారు తమిళంలో నిర్మిస్తున్న 'సతీ బహుళ' సగందాకా తయారైనదని తెలుస్తున్నది.

*  *  *

నేషనల్ ఆర్ట్ థియేటర్ వారి "జయసింహ"కూడా అక్టోబరులో విడుదల కావచ్చును. ఎన్. టి. రామారావు, అంజలీదేవి, రేలంగి, గుమ్మడి, వహీదా రెహమాన్, కాంతారావు, రాజనాల మున్నగువారు ఈ చిత్రంలో నటిస్తున్నారు. దర్శకుడు యోగానంద్.

*  *  *

అన్నపూర్ణా వారి చిత్రం "దొంగ రాముడు" అక్టోబరు 1వ తేదీ విడుదల కావచ్చును. కె. వి. రెడ్డిగారి దర్శకత్వం, డి. వి. నరసరాజుగారి సంభాషణలు, నాగేశ్వరరావు, సావిత్రి, జమున, రేలంగి

ముఖ్య నటీనటీగణంతో ఈ చిత్రం తయారైనది.

* * *

శాహిని పిక్చర్స్ వారి సమర్పణగా ఒక కొత్త తెలుగు చిత్రం నిర్మాణంలో ఉన్నది. ఈ చిత్రం పేరు "భాగ్యరేఖ". నిర్మాతలు పొన్నలూరి బ్రదర్స్. బి. ఎన్. రెడ్డిగారు దర్శకత్వం వహిస్తారు. కథ పాలగుమ్మి పద్మరాజుగారు రచించారు. పాటలు దేవులపల్లి కృష్ణశాస్త్రిగారు వ్రాస్తున్నారు. సంగీత దర్శకుడు పెండ్యాల, నృత్య దర్శకుడు వెంపటి సత్యం ఈ చిత్రంలో నటీనటుల పేర్లు ఇంకా ప్రకటింపబడలేదు. ★

## "రంగూన్‌రౌడీ" ప్రదర్శనం

వెంకటేశ్వర నాట్యమండలివారు ఈ నెల 8 వ తేదీన త్యాగరాయనగర్, వాణీమహల్ లో "రంగూన్ రౌడీ" నాటకం ప్రదర్శించారు. ఈ నాటకప్రదర్శనకు కె. వి. రెడ్డిగారు అధ్యక్షత వహించారు. సినిమా నటులు, నటీమణులు పలువురు హాజరయ్యారు. ప్రేక్షకులు కూడా విరివిగా వచ్చారు

రౌడీగా రాజారెడ్డి నటించాడు. మిగతా పాత్రధారులు వేకటి, సీత, శారద, పాలడుగు సుబ్బారావు, సి. వి రామన్, పి. నాగేశ్వరరావు మున్నగువారు.

## "ది ప్రాడిగల్"

ఎమ్ జి ఎమ్. వారి సినిమా స్కోప్, ఈస్ట్‌మన్‌కలర్ చిత్రం "ది ప్రాడిగల్" మద్రాస్, మిడ్‌లాండ్‌లో ప్రదర్శింపబడుతున్నది. బైబిల్‌లోని "పేరబుల్ ఆఫ్ ది ప్రాడిగల్ సన్" కథ ఆధారంగా ఈ చిత్రం నిర్మింపబడింది. ప్రాడిగల్ గా ఎడ్మండ్ పర్డమ్ నటించాడు. ఒక యువకుడు తండ్రిని, సోదరుని, తనను ప్రేమించి పెళ్ళాడనున్న యువతిని వదలిపెట్టి ఒకానొక స్త్రీ వ్యామోహంలో చిక్కి, ఆమె వెంటబడతాడు. అనేక కష్టాలపాలై చివరకు పశ్చాత్తాపంతో ఇంటికి తిరిగివచ్చి క్షమించమని తండ్రిని కోరుతాడు. ప్రేమించిన యువతిని పెళ్ళిచేసుకుంటాడు. క్రీస్తుకు పూర్వం మూడేళ్ళకిందట డమాస్కస్‌లో ఉన్న మూఢ మతవిశ్వాసాల వాతావరణంలో ఈ కథ జరుగుతుంది. క్షుద్ర దేవతలను ఆరాధించే మతాధికారుల ప్రాబల్యాన్ని ఆ యువకుడు నాశనం చెయ్యడం ఈ చిత్రంలో ప్రధానంగా చూపబడింది. మూలకథను బాగా తారుమారుచేసి, 'ప్రాడిగల్' యువకుని పాత్రను ఉదాత్తమైనదిగా మార్చివేసి ఈ చిత్రం తీశారు. అందుచేత ఇది బిబ్లికల్ కథ అనిపించదు. డమాస్కస్ నగరదృశ్యాలు, దేవాలయం సెటింగులు, వర్ణఛాయాగ్రహణం చాలాబాగున్నాయి.



"నవరాత్రి" హిందీ పౌరాణిక చిత్రంలో నిరూపారాయ్.

ప్రాడిగల్ యువకుని వ్యామోహింపచేసిన స్త్రీగా లానా టర్నర్ నటించింది.

సినిమా టెక్నిక్‌లో ఒక్కొక్క కొత్త విధానం వచ్చినప్పుడల్లా, కథలకోసం హాలీవుడ్ నిర్మాతలు క్రీస్తుశకారంభ దినాలకు తిరోగమిస్తున్నారు. గడచిన రెండేళ్ళలో వెలువడిన అనేక పౌరాణికచిత్రాల్లో ఇదొకటి. ★

##  యజమాని 

(11-వ పేజీ తరువాయి).

మింగి ఊరుకున్నాడు. ఆతరవాత ఓ రెండురోజులదాకా వంటలు కాస్త బాగా చేస్తూ వచ్చాడు. యజమాని ఈసారి చాటుగా చివాట్లు వేశాడు. నారాయణ యథాప్రకారం చేయడం మొదలెట్టేసరికి కాలేజీ కుర్రాళ్లు కస్సుబుస్సులాడుతున్నారు.

ఒకనాడు నారాయణ, ఆమధ్య రెండు రోజులు వంట బాగాచేసి పెట్టానుగదా అని సాహసించి కాలేజీ అబ్బాయిలని సినిమా డబ్బు లడిగాడు. అందులో ఒకాయన 'ఇంకా సిగ్గులేక నీవంటకి బహుమానం కూడా అడుగుతున్నావు' అని ఆక్షే

పించాడు. నారాయణ తన సౌర్య సౌందర్య కౌశలపిచ్చిన చేతిగాని పిర్యాకి కంటగించుకొన్నాడు. మరో అబ్బాయి 'అలా ఆ సుబ్బులుతో వరసలుకలిపి సరసాలాడుతూ చూచోకపోతే వంటమీద నిఘా వుంచకూడదూ' అని చెప్పేడు.

నారాయణ మరి వుండబట్టక 'సంగతులన్నీ మాట్లాడతారేం(ఏటి)బాబూ' అని ఒక్కమాట అన్నాడు 'అంటే నీ అర్థమేమిటోయ్' అన్నాడొక అబ్బాయి. 'అబ్బే మరేంలేదుబాబూ సుబ్బులులాంటి దానివంక కళ్లున్న మానవుడు చూడ్డంలో తప్పేముందండి. మాలాంటి తక్కువవాళ్లు మీ కాలేజీ పిల్లలవంక చూడలేంగదాండి ప్రభువులు మీరుమాత్రం తక్కువవాళ్లని కటాక్షిస్తూనే వుంటారు' అన్నాడు నారాయణ

'ఏమిటోయ్ తంతులా! నిగుడుతున్నావు. సుబ్బులువంక మేం చూస్తున్నామంటావా' అని ఒక అబ్బాయి అనబోతూ వుండగా అతక్కసందులోంచి అప్పలకొండ కాని తీసుకొస్తున్నాడు. అంతతో ఆ ప్రసంగం ఆపేశారబ్బాయిలు. చేతులు కడుక్కొని రూముల్లో మాతులు తుడుచుకుంటున్న అబ్బాయిలతో నారాయణ మెల్లిగా 'బాబూ ఒక్క మనవి' అన్నాడు. - నిజం చెప్పేస్తున్నా మీ దయవల్ల వంటలో నేనేమంత చాతకానివాడిని కాను. కాని నేనుకాని వంట బాగా చేసేస్తే తన కెక్కడ నష్టం వస్తుందేమోనని నాచేత చెప్పి చేయిస్తున్నాడు, నానా అసహ్యమైన పనీను మా యజమాని - నౌకరివాణ్ణి నేనేం జేయగలను? ఆవేళ మీ ఎదురుగా నన్నాయన పెట్టిన చీవాట్లన్నీ మీ ముఖం తుడుపుకి, ఒకే రెండురోజులు పోనీగదా అని బాగా చెయ్యబోతే చాటుకి పిల్చి పడచీవాట్లేశాడు ఇదీ రహస్యం' అన్నాడొక్క బిగిని అబ్బాయి లందరూ ఆశ్చర్యపోయి ప్రొప్రయిటరుకి వినబడేలాగు అయనను తిట్టుకుంటూ వెళ్ళిపోయినారు

ఆ మధ్యాహ్నం అయ్యగారు నారాయణని చాటుగా పిలిచి 'నీ వరస ఏం బాగులే'దన్నారు.

'ఎవరితో? ఆ సుబ్బులుతోనా అండి! దానికీ నాకూ వరసేమిటండీ? ఏదో మాట వరసకి అలా పిలుస్తాను అంతే. అది కొత్త కలుపుగోరు మనిషి. చనువుగా మసులుకొంటుంది అంతే' అన్నాడు నారాయణ.

అయ్యగారికిది కొత్తవిషయం. ఇది బుర్రకెట్టలే దాయనకు.

'ఓహో ఈ కథలోగూడా దిగావే అదెవరో తెలుసా? అప్పలకొండ పెళ్లాం. వాడు ముక్కోపి. వాడికిగాని తెలిసిందా కావిడిబద్ద తిరగేస్తాడు. జాగ్రత్త మరో మాట ఇవాళనుంచి పప్పుగూడా నువ్వే రుబ్బాలి.'

'మరి సుబ్బులో?'

'ఆమాట నీ కనవసరం.'

'పోనీండి అంట్లపనికొస్తుందిగదా'

'అధికప్రసంగం చెయ్యక ముందు నీ పనేదో నువ్వు చూసుకో' అన్నాడు యజమాని

అతని మాటలే విమర్శించుకుంటూ వెళ్ళిపోయాడు నారాయణ

మర్నాడు హోటలుకి సెలవు రోజన్నమాట తొలినాటిరాత్రి సుమారు తొమ్మిదింపావు అవుతుంది. భోజనాలకి రావలసినవాళ్లు వచ్చి వెళిపోయేరు సుబ్బులు పెరట్లో అంట్లు తోముతోంది మర్నాడు హోటలుకి సెలవు కదా అని అప్పలకొండ ఆదగ్గరలో ఇంకేవ



షోరీఫిలిమ్స్‌వారి "జాల్వా"లో మీనాషోరీ, కరణ్‌దివాన్



లక్ష్మి, గారెలతో పండగనాడు ప్రేయసి యింట్లో విందు భోజనం చేస్తున్నాడు రాముడు
అన్నపూర్ణావారి 'దొంగరాముడు'లో గౌరీపతిశాస్త్రి, నాగేశ్వరరావు, సావిత్రి

## ★ యజమాని ★

'అన్నట్టు సుబ్బులూ వారంరోజు లాయె నా పీకుదాను అలాగే తోమకుండా వుంచేశావు ఏదీ మేడమీదకెళ్లి తీసుకొచ్చి కొత్త తోలిచేసి పెట్టు' అని యజమాని కంఠం వినిపించింది సరసర మెట్లెక్కుతున్న మెట్టెల చప్పుడు వినిపించింది. ఆ వెంటనే మరొకరుకూడా మేడ ఎక్కుతున్నట్టు అలికిడైంది నారాయణ దీపం ఆర్పేసి చాలాసేపైంది. రెక్క వూడిన కిటికీ దగ్గర నక్కి చూస్తున్నాడు ఉండుండి అతని చెవికి 'మంచి మర్యాద ఇస్తుడివే వొదలవయ్యా' అన్న మాటలు వినిపించాయి నారాయణ సరసరా తలుపు తీసుకుని వీధిలోకి వెళ్లాడు. ఆ మలుపులో కనిపించాడు కావిడితో అప్పలకొండ నారాయణ వెళ్ళి అతని చెవిలో ఏదో చెప్పాడు ఇద్దరూ దొడ్డిగుమ్మం వేపు నడిచారు అప్పలకొండ కావిడి దింపి లోపలికి వెళ్లిపోతున్నాడు

'ఇంక ఇక్కడ వుండనీ నేను చూస్తాను బద్దకి నేను పూచీపడను అది తీసుకెళ్లు' అన్నాడు నారాయణ

ఇంకా నారాయణ ఇలా చుట్టుముట్టించాడో లేదో 'అమ్మ బాబో చచ్చాన్రా నారాయణా!' అన్న మాటలు వినిపించాయి నారాయణ లోపలికి రెండడుగులు వెయ్యబోయేసరికి అప్పలకొండా సుబ్బులూ వస్తున్నారు సుబ్బులు నారాయణకేసి చూసి నవ్వేసి వూరుకుంది 'ఈయాల దొరికాడు' అంటూ విసురుగా కావి ఎత్తుకున్నాడు అప్పలకొండ సుబ్బు లనుసరించింది ఆవేళ అప్పలకొండ మాటల్లోని అంతర్యం ఇవాళ గ్రహించాడు నారాయణ ఓసారి యజమాని ఎలావున్నాడో చూద్దామని మేడమీదికి వెళ్లాడు. ఆయన మంచం మీద చేరబడిపోయి ముక్కుపట్టుకొని 'అబ్బా' అంటున్నాడు

నారాయణను చూడగానే 'ముక్కెలా చేశా వినంతాను?' అని కస్సుమన్నాడు

'అప్పలకొండండి వాడు మా పెద్ద ముక్కోపి' అన్నాడు నారాయణ, నిమ్మళంగా

'రేపటినుంచీ మీ ముగ్గురూ క... రానక్కరలేదు'

'తక్కినవాళ్లుకూడా రారు ... అందరూ నామాటమీద వుంటారు. ... కలిసి ఒక చిన్న హోటలు పెట్టు... ఎవరికివారే యజమాని మాకు నౌకర్లం ఇక మీ దొడ్డితలుపేను. అని విసురుగా వెళిపోయాడు నారా...

Printed and Published for Nageswara Rao Estates Ltd , by S Radha Krishna at The Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1 Editor . S Sambhu Prasad.




మోహినీ భస్మాసుర

చిత్రకారుడు: గోలి శేషయ్య—తెనాలి.


అక్టోబర్ 1 విడుదల
అన్నపూర్ణా వారి
దొంగరాముడు
దర్శకుడు...... కె.వి.రెడ్డి. B.Sc. (HONS)
స్టూడియో..వాహిని